కోటి సూర్య తేజో విరాజంబు కనకరాంతర్నామ యగుచు
బ్రహ్మ నామకంబును సనాతనంబును నిరవధికంబును
నిర్వికారంబు నానంద మయంబు నధిక। వాత్సల్య
మునను భగవచ్ఛబ్ద వాచ్యంబునై నట్టి యొక మహా హంస రూప,
మును గనిన పట్టుటయు మహా మోద మెలర్పన్।
కనకగర్భుండు హంసను గాంచి యదుగ। దలచి
గీర్వాణ భాషా విధాన మెప్పు। నతి రయంబున కస్తవమ్ము లిడియె బలుకె॥

కం॥ ఆ దివ్య రాజ హంసము
మొందముతో నన్నినాళ్ళు మోముల దొరన
తాన్ని దరము నగను గొని యుదా।
గాదనకను పలికె మరల క్రమముల బూని గతిన్॥

కం॥ కలహంస రూప ధరుడా।
జలజాక్షుడ బలికి నట్టి శబ్దము వలనన్
దెలియగ పద్మజుడెప్పుడు
జవ్వులై జగతి నిక శబ్ద వాచ్యం డయ్యెన్॥

కం॥ లోకములో సుతులకు కేరు
కాకరుడై జనకుడెప్పుడు నామకరణముల్।
దాకాని చేతురు గావున।
నైకొని విష్ణుండు నామకరణము జనకున్॥

కం॥ గాంచెను సంతమున జన
బాంబాబ్జ నివాసుడై పద్మాక్షుధరా
జోనభవ్య జూంబి నాపెరో
వనజుబు హరియటుంబు నెంపగ జెప్పెన్॥

సీ॥ అంత సరస్వతీ కాంతుండు శ్రీహరి చెంతకుం జేరి విశేష మగను

సన్నుతి గావించి సర్వేశ నే నెమి కార్యంబు జేతు తత్కార్యమెట్టి
శాస్త్రంబు చేత విశదము గాదెలి యనుడు దానికి నిప్పుడు ప్రధాన కార్య
మేది యన్నఁ బట్టి హృదయంబు లోపల ధ్యానంబు సేయుడు దయను నాకు
నానతి యివ్వ వలయు హరి భవత్పాదారవిందముల కొనర్తు వందనములు
ననుచు విన్నవింప హంసరూపకుడగు। పద్మలోచనుండు
పరమ కృపను॥

వ॥ అవ్విధంబున హిరణ్యగర్భుండను వాపించి యడిగిన
వాక్యంబుల కెల్ల ముఖ్యంబు గా నక్షర ప్రయుక్తకంబును
సకల శ్రుత్యంత సారంబును సకల ప్రయోజన సాధనంబు
నున్నగు నేకాక్షరంబై ప్రణవం బుపదేశించి విష్ణుం
డదృశ్యుండయ్యె నంత॥

కం॥ శ్రీరమణుడు మును చెప్పిన
నాది శబ్దము మె .... నుంచి యూ ప్రణవంబా
తెరువా తీ నిలుప్ర కాని సు
స్థిరముగ పద్మజుడు జపము సేయుచు నుండెన్॥

కం॥ హరి శబ్ద పూర్వకంబయి
బరగెడు ప్రణవంబు మెదలు బాటించి శృతుల్
నిరతము ను ప్రాయు తతనె ను
కరమతిశయముల యుమ జ్జగంబుల నలరెన్॥

సీ॥ పురుష దైవంబైన ప్రార్థన మేల్గాంచి కడు భక్తి తూర్పు ముఖముగనుండి।
కరమొప్ప శ్రీహరి హరి హరి యనుచును మదిదిరంబుగను ముమ్మారు బలుక
వలయును దానిచే కలుషసంఘములన్ని తొలగి సంచిత శుభంబులు లభించు।
స్నానకాలమున సంధ్యావందన జపాదులందు తుమ్మిన దగ్గినట్టి వేళ
హరి హరి యని పలికిన నప్పుడె కృపను। హరి హరించును దురితచయంబులన్ని

భూరి పుణ్యాచయంబులు బొందఁ జేసి।
యంత్యమున నిచ్చు తన లోక మతులితముగా॥

అది యట్లుండె నంత॥

కం॥ ఏకాక్షరమగు ప్రణవము
గైకొని పద్మజుడు జపము గావింపు ల
క్ష్మీ కాంతుని నుతి యింపుచు।
ప్రాకటు తత్పద్మమున తపంబొనరించెన్॥

వ॥ ఇవ్విధంబున నందపంబు సేయుచు పితామహుండు ధ్యానరాశి
సురవరులు సేయు జపంబునకు మూల మంత్రంబైన గాయత్రి
మూడు పాదాకృతులుగా విభాగించి యందు ప్రథమ పాదాకృతి
యనేక దివ్య వర్షంబులుచ్చరించి తన్మాహాత్మ్యంబున
తన లపనంబున మర్త్యలోకంబున జాత వేద: కర్మంబులను,
యజ్ఞంబులలో స్తోత్ర సాధకంబులైన మంత్రంబులు
తో ఋగ్విధి యను నీతి మహాత్మ్యని గాయత్రి ఛందంబును
యజుర్వేదంబును మానవ నగరంబులలో భూసురులను
పశు నికరంబులలో మేకలను సృజన గావించె మరియు
నప్పితామహుండు తపంబు నొనరింగ దంగి॥

సీ॥ రెండవ పాదాకృతి నందుగా బలుకుచు తత్ప్రభావంబున తన భుజముల
సామ వేదంబు నిజ కర కోష్ఠులలోపల శస్త్ర నరులలో క్షత్రియులను
దివ్యమై తగు జగతీ ఛందమును పశువులలోపలను గొఱియలు
సృజించె। వెండియు తపము గావింపుచు మూడవ పాదాకృతి
మతిని పద్మాసనుండు। తత్ప్రభావంబు చేతను తన తొడల।
యందు ఋగ్వేద విట్పమ యాంగములను।
యజ్ఞ మతి సాధనలు పరి యారు చెనకొటి।

దేవగణములలో విశ్వదేవతలను॥

వ॥ పశుజాతుల యందు గోవులను అనుష్టుప్ఛందంబును సృజియించి
మరియు బ్రాహ్మణవృందము॥

సీ॥ నాలవ పరితపంబాదినిగా వించి తదియక తనదు పాదముల వలన,
మొగినధర్వణ వేదమును యాగముల యందునకలు శస్త్రోత్ర సాధకములైన,
గురుతర మంత్రంబులరువది యెక్కటి సారది మానవులలో శూద్రగణము
పశుసమూహంబులో పలనశ్వ వితతులు కరము థిర సృజియించి కమలభవుడు
సంతసమున నున్న సమయంబునను భగవంతు కరాళయుగము వలన వేదలు
గులిమి వలన బుట్టిరలఘు శూరులు మధు, కైటభాభి
దానవఖల దనుజులూ॥

వ॥ రజస్తమోగుణ ప్రధానులౌటం జేసి, జగత్కంటకులై
పితామహు పాలికిం జని యందు మహానుభావు వృందుల
జపంబు సేయుచు నిమీలితాక్షుండై యున్న యవసరంబున
నామ్నాయంబుల పహరించుకొని యవ్వాలు యసముద్రోదక
మధ్యంబు (బ్ర)వేశించి యడంగి యుండిరంత, యప్పద్మాస
నుండు కేను విచ్చుచూచిన తనచెంత వేదంబులెవ్వియు
శ్రుతులు వేయుం జేసి యెది యుండోచక వారవెను తగుల
నొంపక తనకుం నిజనివాసంబై యున్న తెల్లదామర మెల్లె
మెల్లన దిగ్గితన్నా....ంబు కరద్వయంబునం బట్టుకొని
యనేకదివ్యాబ్ద సహస్రంబులకు దిగువకు వచ్చు,
మెందునమ్మంద జ్ఞానులగు బృందారక పరివంధులంగానక
మగుడి తనయుద్యాస్థానంబగు పద్మంబు మీందికి రా
నుద్యోగించి యున్నారం .... దున్నక .... వ్రజంబుచె
బాధితబాధితగాత్రుండై యదిజవజవలందుటుచె భగ్నంబు

నెందునొ యొక సంతోషంబున మహా భీతచేతస్కుండై తల్లి
పదిలంబుగా నాశం జెక్కి । యత్నంతా యూసంబున యుక్కుమ
అంబు మీదికి వచ్చి । నిట్లు ప్రశ్నలు నిగుడింపుచున్ గూర్చుండి
యధిక విచారగ్రస్తుండై దుఃఖంబు భరింపం జాలనా॥

క॥ అంతట జలములలో బడి
సంతాపింపుచును శిశువు సర.... దుఃఖా
క్రాంతుడై యెడ్చును శ్రీ
కాంతుని నిట్లని నుతింపగా దొడగె నెంకేన్॥

క॥ హరి సర్వేశ్వర గోవింద
ధరమూర్ధేశ్వర ముకుంద దామోదర పా
పరహిత ప్రాణ్వ సహితవనే
కరుణారసము నను నన్నుగావు మహాత్మా॥

క॥ నీకంటె యన్య మెరుగను।
నాకంటికి గాన వచ్చు నను బ్రోవగదే
శ్రీకాంత జాగునేయక
నైకొని యూబారి నాదుగదు ప్రముచంత్రి॥

క॥ అని యివ్విధమున శిశు విన్నదుల।
వనజాసను జూచి దాస వత్సలుడు
జనార్దను డప్పుడు మచ్చరూపం
బున వారిధిని దుమునంటి పోలుప్పగ బలిసెన్॥

క॥ వెరువకు వెరువకు మికనెూ।
యరవింద ప్రభవ యనుచు నభయము సగి నీ।
గురుతన నాసుతు దప్పని
విరవ్పగ వేదములు దెచ్చి యిచ్చెద నీకున్॥

గీ॥ అలమటింపక యుప్పుడీ జలము వెడలి
నీ యుధ్ధాస్థానమైనట్టి తోయజంబు
కదలి నేతెంచి యచట సుఖమున నుండు
మనిన నయ్యజుఁ డరిగె నవ్వనజమునకుఁ॥
అట్టి సమయంబునఁ॥

గీ॥ నిర్మల స్ఫటికాకృతి నిబిడ కాంతి
కోటి సూర్యుల వెలుగున కొమరు మిగుల
నఖిల విద్యాపతికిఁ గర్త యనెడు మతికి
దగు హయగ్రీవ రూపంబు దాల్చె శౌరి॥
అప్పుడు॥

సీ॥ ఘనతరంబగు శౌర్యముననువిజృంభించి ప్రళయవారాశిలోపలనుజొచ్చి
అంబుమధ్యంబునన దగియున్నట్టి యమ్మధుకైటభుల
బట్టి మదమడంచి వేదచతుష్టంబు మోదంబుతో
బుచ్చుకొని పక్షిరాజ వాహనము నెక్కి పీతాంబరంబును
పృథుల రత్నాంచిత భూషణ జాలంబు పొలుపు మెరప
లక్ష్మి యురమున గులుక నీలగిరి సదృశ
దేహకాంతులు దిశలందు దేజరిల్ల
కౌస్తుభ ద్యుతి భానుని గేరడించి వెలుఁగ
నబ్జభవ ప్రముఖుల ప్రత్యక్షమగుచు నిలచె॥

క॥ వేదమయుడైన శ్రీహరి
సాదరమున నప్పుడు పంకజాసనున కొగిన్
వేదములుపదేశించుచు
ఖేదము తొలగించి యధిక కృప నిట్లనియెన్॥

క॥ శ్రీ హరి యాదిని యుపదేశించక

వేదంబులా సంగతిని యవియు దక్షవనీ।
చెదారగని పోలుగ్ర వ్యూర।
నాదయచె నిప్పుడు గలిగె నవినజనేతున్॥

గీ॥ ఆదిని మదుక్తి నుపదేశమతోటు జేసి
సాసగ ప్రణవంబు నాశంబు బొందదయ్యె
నెనరనీ శ్రుతులెల్ల గంబూపి దేశ
మునపు నిలువను లేక యుంటినను బోవ్రూ॥

కం॥ మాయా జ్ఞా ప్రతిపాదక
మైయున్న శ్రుతి ప్రకరము మాయందు చిరం।
బైయుండు జన్మనాశము।
లేయుండ లేకుండు వీటికెన్న ధర్మములన్॥

కం॥ కావున నీ వేదంబులు
భూవలయంబందు నెల్ల పురుషులు చదువం
గావలదు చదివిరేని యు।
ఘోర మహాంబైన నరక పాతులౌదురు పిదపన్॥

ఉ॥ కొందరు బ్రాంహ్మణోత్తములు కోవిద వర్యులచేత వేదముల్।
పొందుగ నభ్యసించి యఘపుంజములన్ విదళించి వైచి మా
యందు మనంబు నిల్పి విమలాంత్మకులై జరియించి పిమ్మటన్।
పొందుదు రస్మదీయ పద భూరిసుఖంబు ననంబు జాపనా॥

ఉ॥ భూమిసురాన్వయంబునను పుట్టి స్వధర్మములైన ధర్మముల్।
ప్రేమ బంధింపలేక విపరీత మతిన్ విహరించు దుర్జనుం।
డీ మహి బ్రంహ్మహత్య జనహింసలు చేసిన వానికైవడిన్
తామరసాస్త్ర నందను నిధామము నన్ బడియుండు నెప్పుడున్॥

తరలం॥ అరయగా సకలంబు మాధర్మముల భ్యసించి ధరాస్థలిన్।

మరచి పోయిన దుర్మదాంధుడు మానని యప్పుడు గాక భూ
సురవదాఘ్రము బొందుచున్ కడు పోలి జొచ్చి నపింమ్ముటన్,
నరకబాధల బొందుచుండు ననంత కాలము పద్మజా॥

సీ॥ అరవింద సంభవ యఖిల వేదంబులు సద్భక్తి యుక్తుడై చదివినేని,
ధారుణీ లోపల ధర్మపద్ధతిగను సకల యాగంబులు సల్పెనేని,
నయ గుణాకరుడై యనాది సిద్ధంబైన భూసురకులమున బుట్టెనేని,
సకల శాస్త్ర ప్రవీణతా సహిత ధర్మవేదివై మించి ధాత్రి విహరించెనేని,
యఖిల లోకతతర్ద్దైనట్టి నాయందు, భక్తిగల శుభము బడయడేని,
వాడు ధరణి లోన వాసికి నెక్కక, పశు సమాను డనగ
బరగు నెప్పుడు॥

కం॥ వేదములు చదివి నాయం,
దాదరముగ భక్తి లేని యాతడు వేదం
బేదియు చదువక మత్ప్రియ
త్రైలిగెడు దాని బోలు డంబుజ గర్భా॥

కం॥ ధరణీతలమున మద్భ
క్తి రహితుడై యున్న భూమి దివిజానికిని మ
చ్చరణాంబుజ భకునికిన్,
పరమాణువు పర్వతంబు పోలుగు జూవీ॥

గీ॥ వేద పఠనంబు మద్దివ్య పాద భక్తి,
మానసంబున నెన్నడు లేని వాని,
పతిత పాషండ యవన సర్వ పాపుడైన
హీన జనముల సముడని యెన్న వలయు॥

కం॥ మెండుగ మద్భక్తి గలుగు
చండాలుండైన గాని సద్భూసురతు

మర్త్యజ్ఞ రామకృష్ణమంత్రి తనూజా॥

మత్తకోకిలా॥

నీరజాస్త్ర సమాన సుందర నిత్యభోగ పురందరా,
సూరి హృత్కమలా ప్రభాకర శుభ్రతర కీర్త్యాకరా
ఘోర దుష్కృత వారధీకర కుంభజాబ్జ నిభాకరా,
దారితారి కృతాధికార వధూరమా వరగౌరవా॥

గద్య॥

ఇతి శ్రీ వల్లభనారాయణస్వామి కరుణాకటాక్ష
వీక్షణా సలబ్ధ సరసకవితా పాత్ర నాగేంద్ర గోత్ర
పవిత్ర గుంటుపెల్లి లక్ష్మణామాత్య హృదయ సుపుత్ర
శ్రీమత్కందాళ వేంకటాచార్య వరసత్కృపాపాత్ర
సాధుజన విధేయ జగన్నాథ నామధేయ ప్రణీతంబైన
శ్రీరంగమహాత్మ్యంబను మహాప్రబంధంబునందు
ప్రథమాశ్వాసము॥

శ్రీ రామానుజాయ నమః॥ శ్రీమ ... నర
పరిటుసూరి వామన భృగురామ దశరథరామ బలరామ
కృష్ణ బౌద్ధ కల్కిభ్యో నమః॥

శ్రీ రాధాకృష్ణ॥ శ్రీ జానకీరామ॥
శ్రీ పరశురామ॥ శ్రీ॥ శ్రీ॥

---

అవిఘ్నమస్తు॥ శుభమస్తు॥.

శ్రీరంగమహాత్మ్యం రెండో ఆశ్వాసము॥

---

శ్రీనాథ శేష పదాంబుజ। మానిత సుజ్ఞానహృదయ
మత్స్యవతుల పాథోనిధి పూర్ణ శశాంక దా।
యామిలయ విహార లక్ష్మీరామాత్మ వరా॥

అవధరింపుము పార్వతీ ధవుడు దేవ।
మునివరేణ్యుని గనుగొని ముదముతోడ
నవని వృత్తాంతమెల్ల నయంబెలర్
నప్పుడు వినుపింపబూని యుల్లమి వెలనెంగిన॥

గీ॥ అంత బ్రహ్మదేవు డజ్ఞ క్షేనావతి
మొనసి సర్వలోకమునకు గతికి
యుగముకు వీర్యవంతులై చతుర్దశలోక
ములను దేవమానవుల సృజించె॥

సీ॥ మరియు చేతా మహాండుర .... శక్తిచే
పశు పక్షి కీటక ప్రభృ ... జంతు
వితతుల సృజియించి విసుకక మరికాన్న
చిత్ర విచిత్రముల్ సృజన చేసి లక్ష్మీశ్వరుని
కృపాలబ్ధ వైభవమున నలరుచు నుండె నత్యంత మహిమ।
నటు గొంత కాలంబు నరిగిన పిమ్మట తమతమ యాధిపత్యముల దప్పు
దేవతాధీశముఖ దేవతా వరులను నాశ మొందుటు
శృతి వచనముల నెరిగి। యెంత వారికినైన ప్రణాంతమునను
భోగమాయువు చెడునని బుద్ధి దెలసి॥

క॥ తన కవ్విధమున గాదె।

ఘనతర విభవంబు దొలగి కేడు నాశము
బొందు నటులుంచు తనదు నెమ్మన
ముని దలపోయుచు చింత మునగిన వాడై॥

కం॥ లలితాత్మ హితము సేయగ
దలచి సరోరుహభవుండు తామరసాక్షున్
గొలిచి దొలంగ నిజ సౌఖ్యము
వలనుగ గైకొందునని ధృఢంబుగ మదిలోన్॥

గీ॥ నిశ్చయించి యధిక నిష్ఠతో దపంబు
సేయ గోరి యపుడు క్షీర సాగ
రమున కరిగి యచట రమ్య స్థలంబున
చిత్తమలర దపము సేయుచుండె॥

కం॥ ఈరీతి తపము సేయగ
సారసంభవుని కడకు సర్వేశ్వరుడా।
శౌరి వరద భవహృతి
తోరంబుగ దాల్చి తచ్చతుర్ముఖు ప్రేమలరన్॥

వ॥ నిలచి యయ్యరవిందనందను డెందం బానందంబునం
బొందన హరవిందనయనుండగు ముకుందుండిట్లనియె॥

కం॥ నా కాయకావ్యరసంబున।
నీకు బ్రసన్నుండనైతి నీవు గోరుగదేన్
సాకల్యంబగు వరములు
గైకొను మిచ్చెదను నీకు కంజాతభవా॥

కం॥ అని యాజ్ఞాపించినన
వ్వనరుహలోచనుని జూచి వారిజభవుడో
యని ఘనాత్మ నీకృపారస

మునగను పట్టుటకు నెల్ల మూలము నాతన్॥

క॥ నీ నిజ రూపము చూపుము
నేను తృష్ణార్తుఁడ నగుచు నీపదయుగళం
బానందంబున గొల్చెద
మౌనులగ నీ దయను జూపి మన్నించు హరీ॥

క॥ మీనాకృతి కమఠాకృతి ।
యూని హయగ్రీవ రూపమును మానితివో
నీ నిజ రూపము చూపక ।
శ్రీనాయక యది మెకాంక్ష నీయదు నెపుడున్॥

వ॥ యివ్విధంబున నంబుజాసనుండు యధార్థంబుగ
శ్రీహరి దివ్యరూపంబు గనుంగొన బ్రార్థించిన
జనార్దనుం డతని కిట్లనియె॥

క॥ అమలంబ ప్రాకృత మతి
రమణీయం బఖిల దురితరహితం బాదినం
దమయము మెలగీశ్వర హా
ద్యమమే ద్యమ సారతమము నాద్యంతంబున్॥

గీ॥ శుద్ధ సత్వం బతి సూనృతంబు ।
నిర్వికారంబు నిత్యంబు నిరుపమంబు
పూర్తి సద్గుణ యుతము సనాతనంబు
కార్యకారణ రూపము కతీతంబు॥

గీ॥ అప్రమేయంబు సతతంబు నిరవధికంబు
విపులతర దివ్య మంగళ విగ్రహంబు
నైన మానిజ రూపంబు నలువ యగునె
కనుగొనుటకల్ప మతులకు కేవలముగ॥

కర్తకారణమును కడగి నేనటు ... మొనసి నాకంటిను ముక్కిమొనగు।
వాంఛితార్థములు యు వరసహాత్వంబును నాం ధనంబును నొసగె సర్వకాల।
ములయందు ననుటయు మొగిని జీవుండు మత్సంకల్పమున జేసి జననమొంది
చేతనత్వంబు గలిగియు చెలగి నందు। దాన భూతత్వమునకు దగు ననుటయు।
బంధమోక్షంబునగు నని బలుకుటయును। గలిగి యు మన్మంత్ర
రాజార్థములరు నెప్పటూ॥

కం॥ నాయందాత్మ సమర్పణ
సేయుట భాగవత దాస్యశేషత్వంబున్
జేయుట పలమని స్థిరముగ
నేయుత నవరించు బండు నిజ మత్రిప్రియుండై॥

కం॥ యీ మంత్రంబున సుజనులు।
భూమి పయింగలుగు సకల భోగంబులను
త్రామపద సుఖము మోక్షము
క్షేమంబుగ్గాంతురిది విశ్లాఘంబున ఘా

కం॥ యీ మంత్ర సార మెఱుగని
తామస యుత మతులు నంను దశకంఠ పగలో
రీ మంత్రంబు పఠింపుచు।
నీమము మతో తపము చేసి నిర్మల మతి వై॥

కం। ననుగను గొనుము నిననజా
సనునకు నెనరనయు జెప్పి సయ్యాననసృతె।
ఘనకరాంభోరుహ కృతి ధరుడగు
వనజాక్షుం డరిగె నిజ నివాసంబునకున్॥

సీ॥ అప్పుడు ముజ్జనకుడైనట్టి శతానందుడు .... రామద్రవరాలచిప్పునట్టి।
అష్టాక్షరి మంత్రము తి భక్తి యుక్తుడై జపమొనరించుచు తపము వేయు।

సంవత్సరంబులు సలుపుచు నున్నట్టి యవసరమున నను దుగ్ధాబ్ధి నడుమ,
రంగదుత్తుంగ తరంగ పాలికే రహిం మించి తేజో విరాజితంబు
నిర్మలంబతి రమ్యంబు నిరుపమంబు, నైన రంగవిమానంబు మానితమ్ము
కమల భవుని తపో వృక్షము వల మధుర
ఫలమనగ గానబడి మెనిశ్చల మహిమ మనూ॥

సీ॥ అప్పుడు నందుడు మొదలైనట్టి వైకుంఠనాగరుల సనకసనందనాది
పరమ యోగీంద్రులు గరుడ గంధర్వులు కింనెరుల్ సిద్ధులు కింపురుషులు
చారణుల్ ఋషులును సాధ్యులు దేవులు నేను మొదల్గు నిఖిల జనులు,
సర్వలోకస్థులు సంతోషయుతులపై పాడగంట్టు వలప్పుడద్భుతముగాంగ,
ఘనగుణాకరుండు వినతాసుతుండు వేద, మయుడు
గరుడు దవ్యమానమున నం మూపనను ధరించి మెప్ప మింరంగను,
వచ్చె నెలమి నతి జవంబు దనరా॥

తదవసరంబునా॥

సీ॥ మైనైన-ఆకాశ మున్నాల జల్లులు గల గొడుగు వేడుకననంతుము ధరించె,
వేత్రంబు చే బూని సూంత్ర వతీశుడ మరసంఘముల బరాబరి యొనరచె,
ప్రకటితేజస్కులై భానుసుధాకరుల్ భయభక్తి నిలిచిరి పార్శ్వములను,
నేవృతుంబు రుద్రుడు నఖిల గంధర్వులు గీతములర్చితి రంతతముగ
నమర గంధర్వ గరుడ గుంహ్యకులు మొదలు
గలుగు దేవతవెల్లను కేర యుగములు వెంట్టుకొని నిజ మస్తకముల ఘుటించి,
భాసురంబుగ సన్నుతుల్ జేసి రనఘా॥

కం॥ చారణా వద్యా ధరులను,
గారవమున బరుదు పద్యా గద్యాదులు వి
స్తారంబుగ జదువు చు పరి
వారంబుల గూడి నడచి వచ్చిరి ప్రీతిన్॥

మ॥ కరపద్మంబులు మోడ్చి భక్తిని శిరఃకంజంబులం జేర్చి స।
త్పులకాంకితాంగు రంగధాముని పదాంభోజాతసేవాయుత
స్థిరతన్ నిర్జరనాథుడేను నుతిచెంతెన్ బృందారకాక్షయం
బు రయహింసన్ మై మెచ్చి క్రొత్త మాగమోద్ధత్ మయులచే స్తోత్రంబులం జేయుచున్॥

చ॥ అనలుడు పంకజాప్తసుతుడప్పతి రాక్షసుడున్ సమీరుడున్।
ధనదుడు భక్తియుక్తి కరతామరసంబులు మోడ్చి చెల్లగా।
వినుతము వేదమంత్రనిచయంబులచే గడు నిర్మలాత్ములై।
ప్రణతులు జేసి మ్రొక్కిరల రంగవిమానము జూచి యయ్యెడన్॥

గీ॥ సకలజనముల జయజయ శబ్దవితతు।
లంబరము పూరితంబు యెవ్వన దృష్టతమగ।
గుబ్బలు గుబ్బలన దేవదుందుభులు మ్రోసె।
నప్సరోంబుజముఖుల నాట్యములు చెలగె॥

గీ॥ పరగ సురలంబరంబున పారిజాత।
కుసుమవర్షంబు గురిపించిరసదృశముగ
రంగధామంబు వన్నె దిరముగ ననుచు।
లలితమైనట్టి దివ్యకాహళులు మ్రోసె॥

వ॥ ఇవ్విధంబున దివ్యగానాన్వితంబును। దివిజమునిగణా
సేవితంబును। దినకరతేజోవిరాజితంబును। దివ్యప్రభావంబును
అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరిజన పరివారసహితంబును
సనక సనందన సనత్కుమార సనత్సుజాత ప్రముఖ పరమ
యోగి జనానందజనకంబు ప్రాకృతరహితంబును। ప్రణవా
కారంబును। స్వయంవ్యక్తంబును। అకృతకంబును। చతుర్వేద
శృంగంబును నగు రంగవిమానరాజంబు తనకభిముఖంబుగా
నొప్పుచున్నం బొడగని చతురాననుండానందహృదయుండ

విందుండై తందర పడి తపంబు చాలించి అష్ట లోచనంబులు విచ్చి
చూచి తొలి భయంబును భక్తి యు నాశ్చర్యంబును హర్షంబును
మనంబున జిక్కుటిల్ల కరసరసిజంబుల ముకుళించుకొని శిరంబున
జేర్చి వేద వేదాంత వచనంబుల బహు విధంబుల నుతి
యింపుచుండె॥

గీ॥ అంత హరి దాసు డగు సనందాహ్వయుండు।
మేలి బంగారు బెత్తంబు కేల బూని।
అంజలి ధరించి యున్న యయ్యబ్జ భవుని
కడకు నేతెంచి మచ్చంత కౌతుకమున॥

సీ॥ రంగ విమానంబు శృంగారకర మక్షరత్రయాత్మకమైన ప్రణవరూప।
మఖిల జన ప్రార్థిత సుదంబు విపులంబున ప్రాప్తతంబు శుభాయతంబు।
శ్రీయుత గంధర్వ గాయనా నాదంబు సకల నిర్జర గణా సన్నుతంబు
సఫణీంద్ర గరుడ విష్వక్సేన సహితంబు రమ్య వేదశ్రీరంగ రాజితంబు
నంబురుహ పత్రనేత్ర దివ్యాలయంబు।
చూచితె నీవు దీని విష్ణుండు జ్యోతి। నంబుజాత మహిమను బవిళించి యున్నవాడు
రూఢి మా రంగ ప్రణవ స్వరూపుడగుచు॥

కం॥ అని చూపి యతడు క్రమ్మర
నని మొన్నెవంటు బ్రహ్మలాదని పెక్కం
డ్రు నిరూఢిగ బూజించిరి।
ఘనులగు శ్రీరంగ విభుని కౌతుక మతులై॥

గీ॥ అందువల వారలారూఢిగా బ్రహ్మ
పట్టణంబు వేలు ప్రభువులైరి।
హర సురేంద్ర ముఖ్యు లిరవుగానీ రంగ
పతిని గొల్చి కనిరి భవ్య మహిమ॥

సీ॥ అంతరాళంబున సప్త(ప్త) ముఖ్యులైన రుద్రగణములు మరుద్గణములు।
ద్వాదశాదిత్యులు వసువులు ఋషులును దేవతాది ప్రముఖ్యాదిక్పతులును।
యగపడుచుండగా నతి మనోహరమును బాలసూర్యప్రభాభాసురంబు
పక్షిరాజు సేనేశతగారుత్మ్మ నిత్యసూరిజనానేకపూరితంబు।
నమర ప్రణవ రూపమై వెల్లుచున్నది। మానరత్నమయ నవమందహాస
సహితము దగుచు నలు దిశల నాల్గు సోపానంగములు నెనరవర
బరకి వైకుంఠ మది యనం॥

కం॥ నాలుగు ప్రదక్షిణంబులు।
కేలుంగవ మోడ్చుకొని యనేకభాష వంతితో।
నాలుగు ముఖముల స్తోత్రము
లోదిని గావించు కొనుచు మెయన్నన జో నెక్కెన్॥

వ॥ యిట్టి ధంబున బునః పునః ప్రణామంబు లొనరించుచు
దివ్య ప్రభా భాసమానంబగు శ్రీరంగ విమానంబు
లోనికి (బ్ర)వేశించి యందూ॥

సీ॥ నవ్యఘనశ్యామ దివ్యదేహంబును మందస్మితానన మండలంబు।
సరసిజాహిఖండ సదృశ లలాటంబు శ్రీకారమలుగొరుచెవ్వల తేరు।
ముఖపద్మ నాసనల్ మొగి ....... హంబులో యనెడు నేరుల
చెలువారు తమ్మిరేకుల బోలు కన్నులు పూలవిల్తుని వింట్లబోలు బొమలు
కంబు కంఠంబు విపుల వక్షలంబు నెగు భుజంబులు జగములకెల్ల ననికి।
పట్టుయిన బొజ్జ తనుగన్న పద్మమున్న। నాభియును గల్గి
మందయును నలువ్వ మూర॥

కం॥ బాక్యం బగు నూరువులను
చక్రాదిబుకానిచకరక సంబులనైన యహా
వికస్యలు శంభారా ఖలదో

త్రిక్ష్మారసి చరణములైన శ్రీ పాదంబులే॥

క॥ శ్రీవత్స కౌంస్తుభంబులను
పావిరి తావుల మెఱుంగు వనమాలికయున్।
శ్రీ వెలయు హేమదామము
పావన యజ్ఞోపవీత భాసురరుచియున్॥

ఉ॥ హార కిరీట దివ్య కనకాంబర రత్నమయాంగదంబులిం
పారగ దివ్యకాంతులలరారు మణిప్రయుతంబులైన వి
స్ఫార ఫణాగ్రఖంబుగల సర్పకులాధిప తల్పమందు శృం
గార రసంబు చొల్లగ నఖండిత వైభవలీల మీరగన్॥

గీ॥ రజితకుధరస్థ సవ్య వీరధర మనగ।
కోటి కందర్పులను మీఱు కోమరు గలిగి।
భాను శతకోటి తేజంబు బరిఢవిల్లి।
నిరుపమాన విలాసంబు నివ్వటిల్లి॥

గీ॥ యొగి నిసవ్య కరంబు క్రిందుగ సముచిత
యమితగతి వల ప్రక్కగా నెత్తగిల్లి।
మొగిని శ్రీ పాదములు లోకింత మయిరుచుకొనుము।
నెడమకై జూపుకొని బవళించి వేడ్క॥

సీ॥ శ్రీదేవి యురమున జెలువుగా గలవాని కరగత శంఖచక్రముల వాని।
అఖిల లోకాధీశుడై వెలింగెడు వాని యజ్ఞభోక్తయు నయ్యమరు వాని
ఆదిమ పురుషుని వేదాంత వేద్యుని కరుణాసముద్రుడై వరలు వాని
పరమపదేశుడై ప్రస్తుతిగను వాని శతకోటి భానుతేజంబు వాని।
అంబుధర రుచిర గాత్రంబు వాని విమల పంకేజ పత్ర నేత్రముల వాని
భక్తమోక్ష ప్రదాతయై బరగు వాని। రంగధాముని గాంచి
జేరంగ నరిగి॥

క॥ అగణిత మగు సాష్టాంగ ములు
గడు ముదంబున నమజేసి లోకాదీశుం
డగు శ్రీరంగేశ్వరు నకు
తగ నిట్లని [illegible] సన్నుతించె తత్పరమతి యై॥

దండకం॥

శ్రీరంగధామంబ సత్పుణ్యనామంబ ప్రాప్తథీవం సురేంద్రాది
భిక్షుప్రభృత్యాదివేయంచితాంఘ్రి ద్వయాంబ్జాలసన్నీర
జాక్షా జగన్నాద సుజ్ఞాన బోధా జితానేక దైతేయ యోధా
పరబ్రహ్మ విశ్వాధినా విశ్వమూర్తీ పరంజ్యోతి రాకార
రాకా సుధాధామ తుల్యానదీన మందార మందార కందార
విందార నీహార పాటీర కర్పూర డిండీర హంసాభ్ర గంగా
భుజంగేశ రంగద్యశః సారదోస్సార గోవింద శౌరి ముకుంద
ప్రపన్నార్తి సంహార వైకుంఠ వాసా హృషీకేశ దామోదరా
పద్మనాభా చిదానంద నారాయణా కృష్ణ గోపాల లీలాకృతి
కేశవా విష్ణు సర్వేశ్వరా వామనా దివ్యమూర్తీ మురారీ
జగత్కారణా సర్వసంజాత గర్భాండ భాండోదరా శార్ఙ్గని
పీతాంబరా శంఖచక్రాయుధా, కైటభారీ నిరాకార నిర్లేప
నిర్మోహ నిర్వాణ కేదారమం భక్త[illegible]కల్ప వంశోద్భవా
యాదవా .... .. తల్ప జ[illegible]న్నాటకా హాటకాక్షా నవో
పాపహారీ సురేంద్రాగ్నికాలాసురాదీశ వాణీశ వాయు
త్రినేత్ర ప్రియగాన రూపా సరోజాత మిత్రాది సర్వగ్రహాకార
దుగ్ధాబ్ధి ముఖ్యాఖిలాబ్ధిస్థ ...... హిరణ్యపనాగారి
ముఖ్యాభ్ర గత్రాంత రూపా సమస్త గర్భాండ కోటి స్వరూపా
త్రిధామాంత్రయీ సార వర్ణత్రయాకార మంత్రస్వరూపా

ఉపేంద్రా భవాంభోధి ..... అయమా విశ్వరూ యూప
దుర్ధారకా రంగ రంగేశ శ్రీరంగనాథా జగన్నాయకా నిండు
గొండాడనే నెంత వాడన్ భవత్పాదపంకేరుహ ద్వంద
మస్మన్మనోబ్జంబునందుంచె సాష్టాంగద .... మా నిన్ను
గీతిక్ంపవేగనీ (బ్రు) ప్రసన్నుండవై నన్ను రక్షింపుమా నీకు నే
హాస్తముల్ మోడ్చి శ్రీవింతు నా తంత్రి నన్ను గటాక్షించి
రక్షింపవే దేవ విప్రోత్తముల్ మీకు నెమ్మోము రాజౌ .....
రువ్వుల్ శూద్ర సంఘాతముల్ మీకు పాదంబులై యుండు గో
స్వామి వర్ణాశ్రమాచార ధర్మంబులున్ యజ్ఞకర్మంబులున్
మీకు సంస్థానమై యుండు నింద్రాగ్నులున్ మీ ముఖంబులు ....
యా వేదవృందంబు ప్రాణంబు విశ్వంభరా చక్ర మెల్లన్ భవత్పాద
పద్మంబులై యుండు నయ్యంతరిక్షంబు మీ నాభి స్వర్గంబు
మీ చారుగాత్రంబు దిక్కుల్ భవత్కర్ణ యుగ్మంబు వాకి
ప్రభూతం బెన్నగా మీకు ..... మీకు బాహ్వల్ శతేనాధుడున్
మీకు పుత్రుండు రేలున్ దినంబులు భవత్పార్శ్వముల్
దేవతాకోట్లు సర్వాంగముల్ దేవ నీవెప్పుడున్ సర్వ
భూతాంతరాత్ముండవై ..... రూఢంబుగా జెప్పు శాస్త్రంబులున్
పాంచరాత్రంబు మోంగానురూపంబులైనట్టి మంత్రంబులు
స్వైరభాషించు వాక్యంబులు స్వైర యధీనంబులై యు ....
ఏకనాధుండవై యుండువో శేషశాయీ హరీ మీ ప్రసాదంబుచే
నేను క్రోధంబునన్ రుద్రుడున్ బుట్టు మీ యాజ్ఞచే నుండు
మో దేవ మీకంటె వేరుండు ..... విస్తరీలాసజాలంబులన్
లేదుగా వాయువున్ వీతిహోత్రుండు మీ యాజ్ఞచే నప్పుమ్సారన్
ప్రాణి సంఘంబులన్నారవు ..... దువో దేవ నీయాజ్ఞచే

సర్వము నిల్చి యున్నది గాని మరి వారికి నశక్యముంగాదు
నన్ను గటాక్షించి రక్షింపవె రంగరాజా నమస్తే నమస్తే నమస్తే॥

సీ॥ స్థూల సూక్ష్మము నీవె। షడ్గుణైశ్వర్య సంపన్న మూర్తివి నీవె
అజుఁడ వక్షరుఁడ వనాది నీవే। నిత్య ప్రభృతి జీవ
నికరంబులును నీవె ధీ గుణావళుల మెందించు నీవె।
సకల జీవ కభీష్టములొసంగుదు నీవె సర్వ జగముకీశ్వరుఁడవీవె।
ఆది పురుషుఁడ వీవె సత్యంబు నీవె। పరమకారణము నీవె శోభనము నీవె
ముల కారణమైన చిన్మూర్తి నీవె। నట్టి నీకు నమస్కారమే మెనరుతు॥

సీ॥ శ్రీరంగపతి మీకు సేవింతు శ్రీరంగవాస మీకొనరింతు వందనములు।
శ్రీరంగరాజ జోహారులు చేసెద మీకు చెలఁగి నుతి యొనర్తు శ్రీనివాస
భగవంతుఁడా మీకు (బ)స్తుతి గావింతు నళినదళాక్ష దండములు మీకు।
నీలమేఘశ్యామ గేలు మోడ్చెద మీకు సురవరనుత నా మజోతలు।
మదనశతకోటి రూప మ్రొక్కెదను మీకు।
శ్రీకరాకార హారి నమస్కృతులు మీకు। తోయరుహనాభ మెప్పటి
జేజే యంటించు। దలఁచి భజియింతు శ్రీరంగధామ మిమ్ము॥

సీ॥ ఘనవాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నులనిరుద్ధ మూర్తి
వై యలరు నీకు పురుషోత్తమాఖిల భూతాంతరాత్మ
సర్వోత్తమా బహ్వతులరై యున్న నీకు। కూర్మ వరాహ
మానవ శింహ హయగ్రీవ మూర్తివై యమరు నీకు
వామన భృగురామ రామలక్ష్మణ భరతాది రూపములను యలరు నీకు।
నరయు బలభద్ర కృష్ణ సాంబ కృతులను।
దాల్చి యనంత మహిమ దనరు నీకు। రంగనాయక
నా యంతరంగమున నెపుడు నిలిపి సేవింతు నను గావు మలఘుచరితా॥

క॥ శ్రీ... మం వరదత్తాత్రేయ ముని

శ్వరుడు వనస్నిగతి కపిల సంఖ్యామివి
సుస్థిర వేద వాన్ని సుదవై
వరలుబడ ఘనబౌధరూపి వగు నినుగొల్తున్॥

కం॥ ఒక మూరు నీ మైత్రికైద।
సకలుష మతి రెండు మూరుల బినుతి జేతున్
ప్రకటముగ మూడు మూరులు
సకలేశ్వర వందనములు సలిపెద నీకున్॥

కం॥ పలుమూలు నిభజించెద
సలలితముగ నేను మూళ్లు సన్నుతి జేతున్
వలమొప్పగ పది మూరులు
సులభుడవగు నిన్ను పదిని స్తోత్రము జేతున్॥

గీ॥ నూరు వరసల మూకట జోహారొనతున్
వేలు వారంబులను మూకట వినుతి జేతు
సం     బులను మూకట ననంత కోటి
మూళ్లి సాష్టాంగములానతున్ మురువక భావా॥

కం॥ అని యిట్లు మహా భక్తిని
వినుతించిన కమలభవుని వీక్షించి స్మితా
ననుడై శ్రీరంగేశ్వరు
డని పెలన్ మాధుర్య రస సమంచిత భణితిన్॥

సీ॥ కమల సంభవ నీవు గావించు నిమ్మహా శుద్ధతపమునకీ స్తోత్రమునకును
హర్షమొందితి మరియూ జ్ఞావహించి విచిత్రంబుగ ప్రపంచసృష్టిమున్న
నేయుటకు ప్రభువి శేషించి మద్గళాలంకృతంగుబు విలాసమైన
యూ స్తోత్రమును జేసి యువ్వాడై ననునంను నుతి యొనరించు నేం
అవికేమ సకల కామిత ఫలములానంగువాండ। గాన యూ స్తోత్రమున

నీవు మాయందుల భక్తిగలవాడవై యత్యుగ్రతపోనిష్ఠా
గరిష్ఠుండవై యుంటివి గావున కరుణాసముద్రుండవైన నేను
నీకు మద్రూపంబు జూపితి। మదీయ జ్ఞానసంపూర్ణ హృదయుండ
వైనకతంబున నీవు మత్స్వరూపంబు గనుంగొనుటకే పాత్రుండవైతివి
గాని యల్పజ్ఞాన హృదయులైన బృందారక మర్త్య సముదయంబు
లుం జాలుదురే యని మరియు నిట్లని చెప్పె॥

ఉ॥ నీవు మదీయ నాభిభవ నీరజ మందుదయించి లోకముల్
వావిరిగా సృజించి సురవారములన్ గరుడోరగాదులన్
బ్రోవుచునుండి యాత్మహితము దలపోయుచు నన్నుగూర్చి యిం
తో విశదంబుగా తపము దాఁ గాని చేసితి విప్పుడెనగన్॥

గీ॥ దాని వలన నీకు నా నిజరూపంబు
గానబడియె నిది జగత్ప్రశస్త
మప్రమేయ మమల మానంద మజ్ఞాన
హరము పుణ్యసహిత మనఘచరిత॥

మరియును॥

సీ॥ ప్రణవస్వరూపంబు పరమపదోకంబు
శేషాదినిత్యసంసేవితంబు నప్రాకృతంబును సుప్రసిద్ధంబు
సదమల వేదశృంగ సమధికంబు।
భూరితరానంత పుణ్యనిధానంబు సకలయోగీంద్రైక సన్నుతంబు
నఘవిమోచనము నత్యానంద సుఖదంబు పద్మాప్తశతకోటిభాసురంబు
దివ్యగానాన్వితంబు జ్యోతిర్మయంబు।
లాలితంబు సనందనాది పాలితంబు మూలకారణరూపంబు
ముక్తిదంబు। నగుచు నేతద్విమానంబు మిగుల నలరు॥

తే॥ గృహదైవతంబుగా బ్ర

త్స్వహము చర్చ నన్నేయు నుండు ననవరతము స
న్నిహితుఁడనై యుండెద నిది
విహితంబు తదర్చన గతి వినుమబ్జభవా॥

సీ॥ పాంచరాత్రాగమ ధ్యాంచిత జ్ఞానినై పంచకాలంబుల ప్రతిదినంబు।
భక్తిగా బ్బూజ స్వాయం వ్యక్తరూపంబు నవతరించితి యర్చావతార
ములకెల్ల నాదినై యులరారుచుండు నీవిగ్రహ పూజచే విశదముగను।
మోక్షంబు సిద్ధించు ముదమొప్పగా నీకు వదలక నూరు సంవత్సరములు।
మహిత భక్తిని నను గొల్చు మానవునికి। యతుల
నిర్వాణ మరచేతిదై చెలంగు। నితర భోగంబులెల్లను నెపుడు యరుదు।
వలసి నప్పుడే యనేకములఁ గలుగుచుండు॥

సీ॥ ఏను జగముల సృజియింపఁగా గోరి యా జీవులలో బ్రవేశించి సకల।
జగముల శక్తి జూయించి సంతోషమున బహురీతులలోడ జరించుచున్న
ధార్మికుడను నే స్వతంత్రుఁడగా వ్యసనించుచే... గల సుకృతైనముఁను
నను బాంధవోరవ్వ నానావిధములైన జంతుజాలంబులకంతరాత్మనై
బ్రకాశింపఁజేయుదు ననవరతము। తిలలలో తైలము నదారువులను శిఖియు
సుమములందు సతావి దుగ్ధములయందు। నాజ్ఞ మున్నట్లు
వ్యాపించి యతులకృపను॥

కం॥ తల్లి వలె హితకరుఁడనై
యెల్ల ప్రజీవకోట్లనెఁతబాయక నా
యుల్లంబున దయ వదలక
నుల్లాసంబునను బ్రోతు నున్నత మతితో॥

కం॥ నామాయ దెలియనో పరు
వేమారు ప్రసిద్ధులైన వేలుపులైనన్
తామసులై విహరించెడి

పామరులన్ జెప్పనేల పంకజగర్భా॥

గీ॥ అరసి లోకంబులను బ్రోచు కారకను నేను
వెలిగి బ్రహ్మాండములు బ్రవేశించి దుగ్ధ
జలధిలోపల సూర్యమండలము లోన
నాకమున వాసమై యుండు ననవరతము॥

కం॥ అది గారణంబు ననునే
విదితముగ త్రిధాముడనెడి విమలాఖ్యాతనై
ముదమున వెలయుచు నుండుదు
త్రిదశ వ్యూహము గడు నుతింపగ నెప్పుడున్॥

కం॥ యీమాట్లు నున్న ననుగన
తామసులకు రాజసులకు దరముగునే మ
న్నామ సుధారస పానము
నేమంబుం జేయు సాదు వితతికె కాకా॥

వ॥ అట్లగుటం జేసి నిర్హేతుక కృపాసముద్రుండనై యున్న నేను॥

సీ॥ పగనైన వగనైన ప్రాణభీతినైన సంస్నేహమునైన జనులు నన్ను।
దలచి కృతార్థులై తరియింప వలెనని మత్స్య కూర్మ
వరాహ మనుజ సింహ। వామన భృగురామ రామ హాలాంక బౌ।
ద్ధ కల్కి ముఖ్యావతారములను। జేయుచు నెన్కకొన్ని
చిత్రములగా వింపుచుండుదు గాని వేరొండు లేదు।

missing.

బులం బ్రకాశింపుచు నున్న నన్ను షోడశోపచార విధులం
బూజింపుచు సతతంబు సన్నుతింపుచు మదీయేతరులు
గాని యుండుచు మన్నామ స్మరణంబు సేయుచు వారికి
వారికి బోధించి యుపదేశింపుచు భజనంబు గావింపుచు

సుజన ప్రజంబులు దివ్యంబగు మదీయ పరమ పదంబునం
జేరి సౌఖ్యంబుల ననుభవింతురు మదవతార విగ్ర
హంబులు చతుర్విధములై యుండునని చెప్పెదను ।
స్వయం వ్యక్తంబును । సైద్ధంబును । మానుషంబునన
నాలుగు విధంబులుగల వందులో స్వయం వ్యక్తంబు
పరమ పద విగ్రహంబు । తక్కిన త్రితయ రూపంబు
తెల్పియున్నను । దేవతా ప్రతిష్ఠితంబైన యది దివ్యంబనం
బరగు ఋషిగణ ప్రతిష్ఠితంబైన సైద్ధంబనం బరగు ।
మానవ ప్రతిష్ఠితంబైన యది మానుషంబనం బరగు ।
నీరజగర్భా నీవును పాంచరాత్ర శాస్త్రంబునందు
సాత్వతంబు పౌష్కరంబను రెండు కల్పంబులుం గలవు
యా కల్పంబులు రెంటియందు విహితాధికారంబున
దీక్ష వహించి పాంచరాత్ర శాస్త్రజ్ఞులైన మత్ప్రపంచ
కంబుతో గూడుకొని శ్రీ వాసుదేవ ద్వాదశాక్షరీ మహా
మంత్రరాజ జపనిష్ఠాగరిష్ఠండవై యమనియమ
మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణా
సమాధినామ మష్టాంగ యోగవిధానంబున మదీయ
పూజ గావింపుమా ॥

గీ॥ శ్రీమద్ద్వాదశాక్షరీ మంత్ర జపితులై కోరి తెల్పితి మదిని నీరజాక్ష ।
మమ్ము పూజ సేయు మనుజుండు మద్దివ్య
పరమ పదము నొందు భవ్యుడగుచును ॥

సీ॥ వలను మీఱంగ నవ(బ్ర)హ్మలును మనువులు పదునలుగురు బలవిరోధి
ప్రభృతి దేవతలు సప్తర్షిగణంబును నఖిల కర్మంబులు నాచరించి
తదధికారంబులు దాల్చి విష్ణుపదంబొంది యా యా ఫలంబుల ననుభవించి

ఆప్రార్వ్యమును క్షీణమై పోయినప్పుడు మగుడ జన్మాంతరరు మర్త్యుఁ మనన
మానవ్యంత్రైన మరియు నవ మత్స్యఁ త్రైన। యూని నిష్ఠా వయుత్రైనన్ను బూజచేసె
వేని యొంతడు మగుడ జన్మాంప నెల్లకనష్ట మా మత్పదము
జెందు నతి ముదమునా॥

క॥ నీవృత్తమాధికారివి
గావున నీ హృదయమునను గదు భక్తిని
యా శ్రీ వాసుదేవ మంత్రము
వెవేగం దెలసి దినవిధ్యాక్తముగన్॥

సీ॥ మంత్రము బూజింప్రము మరువక నూరేండ్లు జనిన
నీకు లభించు సరిగ్గాదు। మహానీయ పదము
సమస్త జన్మంబుల నితర మంత్రములు పఠించినట్టి।
యతనికి గాయత్రి యందధికారంబు ప్రబలయుండును పంచభవములందు
గాయత్రి దప్పక కరము జపించిన క్రతువేదముల కధికారి యగునని।
అట్టి యజ్ఞాతపోధ్యయనాదు లెల్ల నగణితమైన జన్మంబులందుఁజేయు
నతనికి మదీయ సద్భక్తి యందు లేశ మాత్రములభించు
వినుపెక్కు మాటలేలా॥

క॥ యుత్తరగున భవములు పై
త్రైత్రీన యంతనికి గాక యీ మంత్రములన్
రిత్త వచనములు దారుకునే
వృత్తిగని ద్వాదశాక్షరీ మంత్రము గీన్॥

గీ॥ జపము గావించు వారికి సకల దురిత
చయములంటవ తొలగునిది సరిగ వాసు।
దేవ భజనంబు నను జేసితీ వ్రమైన
వార్ధి దుర్భక్ష మృత్యు భయములు రావు॥

గీ॥ వాసుదేవపరాయణులైన సతతము
వెలయు ఘనునికి సర్వేష్టవితతులెల్ల
దొలగి నిర్మలహృదయులై లలితవాసు
దేవసాయుజ్యమొందు సందేహ మగుచుమా॥

గీ॥ ఇతర ధర్మంబులందుల నిష్ఠ జేయు
వారికొకవేళ భ్రంశంబు వచ్చునేని,
వారథో గూంటి యవస్థ నొంది.
యశ్విన పక్వ ష్టలై బుట్టుచుందు రెప్పుడుం॥

చ॥ అనిశము నిన్ను గొల్చు సుజనాలికి భ్రంశము వచ్చెనేని యం
ఘనులకు నెన్నతైన నరకంబుల ఖింటక జన్మమెత్తి వై
నను కనకంబు సంపుటము వన్ ఘనకాంతి వహించినట్లు స
ద్గుణమున జెంది సౌఖ్య సముదంచిత ముంతకలనుందు
రెప్పుడున్॥

వ॥ మరియు స్వయంవ్యక్తాద్యర్చా విగ్రహంబుల విధంబు
వినుము॥

సీ॥ ఆద్యర్చరూపమై యమరు శ్రీరంగంబు నతులితంబగు
వేంకటాచలంబు, తనర సాలగ్రామ ధరణీధరంబును
శ్రీముష్ణామక క్షేత్రమదియు, నరనుత వై
ముష్ణనైమిశారణ్యంబు ననఘమై బరగు తోతాచలంబు,
పుణ్యనిధానమౌ పుష్కరక్షేత్రంబు నల నరనారాయణాశ్రమంబు
ననగ నెనిమిదియును స్వయంవ్యక్తములన,
బరగు మోక్షప్రదంబులై ప్రతిదినంబు,
నీస్థలంబుల దర్శించెనేని జనుడు కలుషములు
బోయి దివ్యసౌఖ్యములనొందురు॥

గీ॥ అచలమేక వస్తువగు విగ్రహంబెన్న
చలన విగ్రహంబు సరవి మూడు
వస్తువులను జేయ వలసిన యది యందు
నేక వస్తు మూర్తి యనదగును నేమ॥

క॥ పరవాసుదేవు మూర్తిగ
బరగుదు పృథుచక్రవర్తి భరతాదులు మ
త్స్య రుచిర విగ్రహ పూజలు
నిరవుగ గావింతు రధిక నిష్ఠాయుతులై॥

వ॥ ఆ యనేక వస్తు రచిత విగ్రహంబందు పరవ్యూహ
విభవావేశావతారంబులలో నెక్కొక రూపంబున
నిలచి దృష్టిగోచరుండౌను॥

సీ॥ ఆది విహములలో నధికావయవములు
న్యూనావయవములు నూర్ధ్వ దృష్టి
భావించి చూడ నధోవీక్షణంబును
భయద వక్ర దృష్టి యును గాక
ననఘ దృష్టి ప్రియంబును మోహనంబును
సౌందర్య రూపంబు సౌమ్య దృష్టి
రమ్యమై శిల్పశాస్త్ర ప్రకారంబుగా విలసితమైన మద్విగ్రహంబు
సంచిత జ్ఞాన మతిని నిర్మించి పూజ సలుప వలయును
భక్తితో సంతతంబు, నిట్టి విగ్రహములలో సంగు నేప్సితములు
వదలకను పూజ గావించు వారికెపుడూ॥

గీ। మొగి స్వయంవ్యక్త విగ్రహమున్న యింట
యుర్వి యన్నంగ చుట్టు దివ్య యోజనములు
పావనంబును సతత శుభావహంబు।

గీ॥ ఆభిగమనము పాదానములఘు నిజ్య
స్వాధ్యయమనము యోగంబు ననెడి పంచ
విధములను ననన్య పూజ గావింపు మెప్పు
డందువు మోక్షాధికారివి యగుదువు విప్రా॥

గీ॥ అనిన విని పద్మగర్భుఁడత్యాదరమున
రమ్యమోక్షప్రదాయు శ్రీరంగశాయి।
గాంచి యోదేవ మీ పాదకమల పూజ
సేయుటెట్లు మంత్ర మెయ్యది చెప్పవలయు॥

క। అనికమలగర్భుఁ డడిగిన
విని యా శ్రీరంగశాయి విమల కృపాయు
క్తిని రూఢ వాక్యములచే।
ఘనతరముల గ నిట్టులనియె కమలజుతోడన్॥

గీ॥ ఇతరమగు ధర్మములు నొనరించువేళ
వికలతయు వచ్చెనేని యవి ఫలమగును।
చెలగి మద్భక్తి యెబ్బంగి జేసిరేని
ఫలముగాని విఫలము ప్రాప్తరింబుగాదు॥

క॥ బహుజన్మాంతరముల స
ద్విహిత జ్ఞానంబు గల్గు విమలచరిత్రుం
డిహలోక సౌఖ్య పరసుఖ
సహితుండై చెందు నాదు సారూప్యంబున్॥

గీ॥ వాసుదేవమయంబు సర్వప్రపంచమనుచు ~~[illegible]~~
~~[illegible]~~ జనుండు మహాఘనుండు
వనజ శంఖ చంద్రములు జ్ఞానవిగ్రహంబు
లతని బాధింపగా జాలవనవరతము॥

గీ॥ ద్వాదశాక్షరి జపియించి వాసుదేవు
దలచుచున్నట్టి మహాప్రద దాసతతికి
కలుషములు బోవు మోక్ష సౌఖ్యంబు గలిగి
మగుడ జన్మంబు లేదు భూమండలమునా॥
అనఘ మదియట భక్తి రహితాత్ముడు గోవధ బ్రహ్మహత్యల
యొనరనెంగి జేయు వారి గతి కాలయుతై ప్రనరుద్భవంబుగ
ల్లి నతరి సంత్సాజుండగుచు కిల్బిష ప్రవృత్తి జరించుగాని యు
ద్భినటు సుజన్మమెత్తరిది సిద్ధము మద్వచనంబు పద్మజా॥
కం॥ శ్రీరంగ క్షేత్రంబును
సారంబో పాంరి చరాత్ర శాస్త్ర విధంబున్
ధీరగుణాల మద్భక్తుల
సారెకు నిందించు కుమత సముదాయములన్॥
గీ॥ కిల్బిషంబునకును పిడ కేలు గట్టి
క్రూర శస్త్ర వినాలు నేర్ గోయు వలయు
సర్వ జనములు శ్రీరంగ సంస్మరణము
సలిపి రా స్వర్గ నరకముల్ ఖిలము నొందు॥
శ్రీరంగ భజన సేయుని
క్రూరాత్మునికి దుటు కన్న గుణమై యుండున్
ధారుణి కుండ్రాలకి దుటునని
సారంబైనట్టి మత్ప్రసాదము నతాప్స॥
కం॥ ధారుణి గగన దివంబుల
నారూఢిగ నెచటను సంటి వైనను నీవే
శ్రీరంగాభిముఖుడవై
సారస భవ మొక్కు మెప్పుడు సాష్టాంగముగన్॥

సీ॥ మనుపుగా నను పీఠమునకును నాకర్షించి యాసనం బిచ్చి పాద్యార్ఘ్యములిడి
నయము మెప్ప యాచమనం బిచ్చి స్నానంబు గావించి శుద్ధాంశుకం బొసంగి।
పూతమౌ యజ్ఞోపవీతమర్పించి చందన పుష్ప తులసికాదరములొసగి
విమల సుగంధ ధూపము దీపమర్పించి వివిధ భక్ష్యాది నైవేద్యమిచ్చి।
పొసగ కర్పూర తాంబూలము లొసగి చుట్టు।
తిరిగి సేవించి పూజింపు మరయ నీవు।
సురలకు శ్రేష్ఠయౌ రీతి షోడశోప। చారముల బూజ
సేయుము సంతతంబు॥

గీ॥ కడగి మంత్ర పూర్వకంబుగా నీ షోడ
శోపచారముల సమస్తముగ
పూజ చేసి మంత్ర పుష్పమర్పించి స్తో
త్రములు జేయు మిప్పు డనఘ హృదయ॥

క॥ అని చెప్పి రంగపతి న
య్యనఘ నారద యమిం డనప్పు డబార్గత్యుతితో
వనజభవు డవ్వామనము
మును గొని తన యుత్తమాంగమున దరియుంచెన్॥

క॥ ధరియుంచి దెచ్చి సురరి
పుర విద్యాధరులు ఋషులు నయమున బాగడన్
వర సాత్వ్యాయన జగము న
విరజాఖ్య నదీతటమున విమలతలమునన్॥

సీ॥ లాలితంబైన తులా మాస మందున నసరవితోఁ కృష్ణపక్షమున విదియ
నాడు శకటనామ నక్షత్రమందు విద్యుక్తంబుగా భక్తియుక్తముగను।
శ్రీరంగపతి బ్రతిష్ఠింపఁజేసి పాంచరాత్రాగమ కోవిదులైన యట్టి
రుత్విక్కులను దానమెలమిని గూడుకొని వంచితతీల బూజించి యప్పుడు।

శ్రీవత్సాతారక నవ భవ్యత స్వస్తతను దగుచును।
వైభవంబున హితోత్సవంబు వెల్గ।
జేసి సంతుష్ట హృదయుఁడౌ వాసుదేవు
కెరుణావదసి యఖుండు సుఖమున నుండె॥

గీ॥ అంత దివిజులు స్వాయంభువాది మనువు
లను (బ్ర)జాపతులను మరి తనకు ప్రియము
గల మహాత్ముల నెల్లను బిలచి రంగ
విభుని పదపంకజములు సేవింపఁ జేసి॥

కం॥ ఒకనాఁడు పద్మినీధవు
డకుటిలమతితో డనఘు కెరుదేరగ నో
టుక గబ్రహ్మం డాతనికిన్
ప్రకటశ్రుత్యర్థ పాంచరాత్రం బొసగెన్॥

కం॥ ఉపదేశించి కరుణన
త్తపనుని దోఁద్యానుబను రంగధాముని శ్రీపా
దపయోరుహయుగ సేవా
నిపుణుని గావింప నతఁడు నిర్మలమతితో॥

గీ॥ పాంచరాత్రాగమంబున నచవ్య వైతన,
నిత్యనైమిత్తికోత్సవ నికరములను
అంబుజదళాక్షు నారాధనంబు చేసి
విమల భక్తిని కరకమలములు మొగిచి॥

వ॥ సేవించి రంగపతి సన్నిధి నొక్కనాఁ డిట్లనియెను॥

కం॥ మాం వంశసంభవాఖిల
భూవల్లభతతుల చేత పూజలను గొనం
గా వలయు ననుచు సన్నుతి

గావించిన రంగవిభుఁడు కేరళరాజాన్వితుఁడై॥

వ॥ ఆ విన్నపంబునకు యన్ని కాదని సంతుష్ట హృదయారవిందుఁడై యరవింద బాంధవుండు కొంత కాలంబునకు తన తనూభవుం డైనట్టి॥

వైవస్వత మనువునకా
పావనమౌ పాంచరాత్ర పద్ధతి దెలుపన్
భావించి యతఁడు జనకుని
కైవడి శ్రీరంగనాథుని సేవించెన్॥

వ॥ ఇట్లు సేవింపుచుండి కొన్ని వత్సరంబులు గడచి చనిన యంతా॥

చ॥ ఆకమలాప్త సూతి తన యాత్మభవుండగు నట్టి దేజరిల్లు ని
క్ష్వాకునకుని పాంచరాత్రతను సద్విధితో నెనరించి వేడ్కతో
పాకట రంగధామము నిదు పారచరిత్రలు దెల్పగా నతం
డేక మనంబున దపము నీశ్వరుడౌ హరిగూర్చి సేయన్॥

గీ॥ బ్రహ్మదేవు చేత రంగవిమానంబు
పడసి పూజచేసి వడసె ముక్తి
యతని వంశజాతులగు భూభుజోత్తము
లట్లు పూజచేసి యలరుతరిని॥

గీ॥ ఆ శ్రీవాసవ మూర్తియై యలరుచున్న
రామభద్రుండు నిజకుల స్వామియైన
రంగధాముని కేరళరాజతరంగు డగుచు
నల విభీషణునకొసంగి యనుపుటయు నంత॥

కం॥ శ్రీ వెలయగ నాతఁడు భయ
కావేరి తీరమున నకుంఠిత మహిమన్
తా నగ నిలిపి ప్రతిష్ఠ యయ

శ్రీవత్సాంకిత నవభవ్యత స్తోత్రము దగుచు।
వైభవంబున నిత్యోత్సవంబు వెల్ల।
జేసి సంతుష్టహృదయుడౌ వాసుదేవు
కరుణ కావడసి యుఋండు సుఖము ననుండె॥

గీ॥ అంత దివిజులు హర్షయంబు పాడి మనువు
లను (బ్ర)జాపతులను మరి తనకు ప్రియము
గల మహాత్ములనెల్లను బిలచి రంగ
విభుని పదపంకజములు సేవింప జేసె॥

కం॥ ఒకనాడు పద్మినిధవు
దకుటుల మతితో దనుజ కరుదేరగ వా
టుకగర్భరంగధామునికిన్
ప్రకటశ్రుత్య ధర్మ పాంచరాత్రంబొసగెన్॥

కం॥ ఉపదేశించి కరుణను
త్రేపనుని దోడ్కొనుచు రంగధాముని శ్రీపా
దపమోరుహ యుగ సేవా
నిపుణుని గావింప నతడు నిర్మల మతితో॥

గీ॥ పాంచరాత్రాగమంబు నభవ్యవైత న।
నిత్యనైమిత్తికోత్సవ నికరములను
అంబుజదళాక్షునారాధనంబు చేసి
విమల భక్తిని కరకమలములు మొగిచె॥

వ॥ సేవించి రంగపతి సన్నిధి నెక్కొనా డిట్లని విను॥

కం॥ మా వంశ సంభవాఖిల
భూవల్లభ తతులచేత పూజలను గొనం
గావలయు ననుచు సన్నుతి

గావించిన రంగవిభుడు కేరళరాష్ట్రస్థుడై॥

వ॥ ఆ విన్నపంబునకు యన్నికొనిన సంతుష్ట హృదయారవిందుడై
యరవింద బాంధవుండు క్రొంత గాలంబునకు తన తనూభవుం
డైనట్టి॥

వైవస్వత మనువునకా
పావనమా పాంచరాత్ర పద్ధతి దెలుపన్
భావించి యతడు జనకుని।
కైవడి శ్రీరంగనాథు గని సేవించెన్॥

వ॥ ఇట్లు సేవింపుచుండి కొన్ని వత్సరంబులు గడచి చనిన యంతా॥

చ॥ ఆకమలాప్త సూతి తన యాత్మభవుండయినట్టి దేజరిల్లుని
క్ష్వాకుని పాంచరాత్రికుని సద్విధితో నెనరించి వేడ్కతో।
పాకట రంగధాముని యపార చరిత్రము దెల్పగా నతం
డేక మనంబున దపము నీశ్వరుడౌ హరిగూర్చి సేయుచున్॥

గీ॥ బ్రహ్మదేవు చేత రంగవిమానంబు
పడసి పూజచేసి వడసె ముక్తి
యతని వంశజాతులగు భూభుజోత్తము
లట్లు పూజచేసి యలరుతరిని॥

గీ॥ ఆశ్రితావన మూర్తియై యలరుచున్న
రామభద్రుండు నిజకులస్వామియైన
రంగధాముని కేరళాంతరంగుడగుచు
నల విభీషణునకొసంగి యనుపుటయును॥

కం। శ్రీ వెలయగ నాతడు భయ
కావేరి తీరమున నఖండిత మహిమన్
తా వృగనిలిపి (బ) తిష్టయు

శోభనములం దగునను జేసె సురలు నుతింపన్।

క॥ అది మొదలు రంగధామము
విదితంబుగ నచటి మనుజ వితతుల చేతన్
ముదమున పూజలు గాంచుచును
కదలక సుస్థితి వహించు కల్పాంతంబున్॥

గీ॥ సర్వజనులకు ముక్తిద స్థానమగుచు
చంద్రపుష్కరిణీ తీర జగతి యందు
గాన బడుచున్నది ప్రతి విమాన రత్న
మనుచును గౌరీశ్వరుడు చెప్పె నమర మునికి॥

క॥ యువ్విధమున జెప్పిన విని
యవ్వనజాసనుని సూనుడతి హర్షంబై
యివ్విధమె యడుగ కోరిక
నివ్వటిల పార్వతీశునికి నిట్లని యెన్॥

క॥ సారసభవ పుత్రు డిటుండిన
యీ రంగవిమానమునకు నేకే గతి వచ్చెన్।
కారుణ్యమూర్తి వై వి
స్తారంబుగ జెప్పవే కృశానువిలోకా॥

క॥ భవదీయ పదాబ్జములకు
వివిధంబుగ నచట్ తిప్పు వినుతులు జేయున్
శివ సర్వేశ్వర గౌరీ
ధవ శరదంబుద నిభాంగ ధవళితాంగా॥

క॥ అని వేడ్క బంగుల నుతి
ద్విరనుతులు గావించి యధికే వినయాన్విత హృ
ద్వనజాతుడగుచు నారద

మునికులనాథుండు మోదమున నడుగుటయు॥

చ॥ పరమవివేకసంభరితభావము మోభవరూపశాస్త్రవో
త్కరమదభంగ విష్ణుహరిదాసగుణప్రియమానసాబ్జవి
స్తరసుగుణాలవాలబుధసత్కవిగాయకపారిజాతబం।
దురకరుణావిశాలజనతోషణ నిర్మలసత్త్వభూషణా॥

క॥ హరిభక్తియుక్తమానస
హరిదాసవ్రాతసంతతామరభూజా
హరిమతధర్మసుభూషణ
హరిసన్నిభతేజ రంభమాంబతనూజా॥

మాలిని॥
సమదవిమతదూరా సాధులోకోపకారా।
కమలదళనిభాక్షా గర్వితాక్రూరశిక్షా।
విమలసుగుణసాంద్రా విస్ఫురత్కాంతిచంద్రా।
సుమహితశుభరూపా స్తుత్యకీర్తిప్రతాపా॥

గద్య॥
ఇది శ్రీవల్లభనారాయణస్వామికరుణాకటాక్ష
వీక్షణసంలబ్ధసరసకవితాపాత్ర నాగేంద్రసగోత్ర
పవిత్ర గుంటుపల్లి లక్ష్మణామాత్యసుపుత్ర శ్రీకొండాళ
వేంకటాచార్యవరసత్కృపాపాత్ర సాధుజనవిధేయ
జగన్నాథనామధేయప్రణీతంబైన శ్రీరంగ
మాహాత్మ్యంబను మహాప్రబంధంబునందు ద్వితీయా
శ్వాసము॥ శ్రీరామచంద్రాయ నమః॥

శ్రీ॥ శ్రీ॥ శ్రీ॥ శ్రీ॥ శ్రీ॥ శ్రీ॥
శ్రీ॥ శ్రీ శ్రీ॥ శ్రీ॥ శ్రీ॥ శ్రీ॥

అవిఘ్నమస్తు ॥ శుభమస్తు ॥

మూఁడో ఆశ్వాసము ॥

శ్రీ వనితాహృదయేశ్వర
పావనచరితానుమోదభవ్యమనీషా
బాంవాబ్జముకర్షవాసన్నయ
పావనలక్ష్మీశా సమ్ముఖ్య బంధురముఖాబ్జా ॥

క॥ అవృధరింప్రము శైలసుతాదినాథు
తమరమునివర్యుఁ జూచి యుల్లిని మెనల్లి
పద్మగర్భుండు తననిజభవనశీమ
మొగిని రంగేశుఁ బూజింపుచుండె నెలమి ॥

ఉ॥ అంత వరాహకల్పమున నంబురుహోత్తతనూభవాఖ్యమ
న్వంతరవేళ తత్కృతయుగాదిని తన్మనుపుత్రకుండు వి
శ్రాంతయశోధురందరుడు సజ్జనమిత్రుడు రూపజిత్రతీ।
కాంతుడు శాంతుడున్నతుడు గాఢపరాక్రమశాలి యన్నగన్ ॥

గీ॥ వసుధ నిక్ష్వాకునామభూవల్లభుండు।
నిర్మలజ్ఞానభరితుండు ధార్మికుండు
వంశకరుడుత్తముడు బుధవత్సలుండు
సదమలుండాది రాజన్యసత్తముండు ॥

అట్టి మహారాజశేఖరుండు ॥

సీ॥ వేదవేదాంతార్థవిశ్రుతసుజ్ఞానభరితచిత్తాబ్జితాం ధరణిసురులు
సమరరంగాగతశాత్రవాంభోధరఝంఝూసమీరులౌ క్షత్రవరులు
హాటకరజితమహానిధానాఢ్యులై యొప్పుచున్న యర్యజనతతులు
బహువిధధాన్యసంపదఁ గల్గి గోకృషిరక్షణాదరులు శూద్రప్రజములు
కేవ్వలు విద్వజ్ఞనాం విగల్గా యుకేలునను, మదగజాశ్వవితతులును

Composed by 1. [illegible]

మానవతులు సకల సౌభాగ్య సంపదల్ బాలగలిగి
అలరు సాకేతపురమున కధిపు డగుచుండె॥

కం॥ భగవద్ధర్మంబులు నిం
పుగ వేద పురాణ శాస్త్రములు శరవిద్యా
నిగమము ముని గతశ్రముడై
తగు బుద్ధినియభ్యసించి దక్షుం డయ్యెన్॥

కం॥ వర్ణాశ్రమ ధర్మంబుల
నిర్ణయములు దప్పనియటు నిఖిల జనములన్
పూర్ణ జ్ఞానము గలిగియు
హర్నిశము ను బ్రోచుచుండె నధిక ప్రీతిన్॥

గీ॥ కడిది మునులందు నిష్ఠాగ్రగణ్యు డగుచు వ
శిష్ఠ నామ మహర్షివర్యుని శిష్యు డగుచు
రాజసూయాది విమఖములు భూజనంబు
లలరగావించి నిష్ఠాయుతాత్ము డయ్యె॥

మ॥ సకలారాతి ధరాతలేంద్రుల భుజాకార్యంబునన్ గెల్చి హా।
టక భూమీధర ధీరుడై సిరులకున్ ధాత్రైననేకంబు చే
నకలంబుగ వెల్గుచున్ సకల రాజన్యాధీశ్వర వ్రాతనా
యకుడై కీర్తి వహించె తద్ధరణి నాధాగ్రేసరుం డప్పుడున్॥

సీ॥ తన భుజాబల మరిజన సముదయ పర్వతములకు వజ్రాయుధంబుగాగ
తనదు దాన ప్రశస్తంబైన హస్తంబు ద్విజులకు కల్పధాత్రీరుహమగ
తనలసత్కీర్తి దిక్తటినీచయములకు బొండుమల్లెల పువ్వు దండగాగ
తన రక్షకత్వంబు ధరణీ ప్రజాళికి సలలిత పంజరము గాగ
తన గుణంబులు సుజన వితానములకు। వితత సంతోషకరములై
వెలయుచుండ చోర దుర్భిక్ష భయములు బారదోలి

ధరణి బాలించె నిక్ష్వాకుడు వరవరుండు॥

గీ॥ సర్వ భూచక్ర మెల్ల నిష్కంటకముగ
పాలనంబొనరించి ప్రజల పరమభక్తి
సకల గుణవంతు భగవంతు సంతతంబు
నర్చనలు జేసి భాగవతాద్యుడయ్యె॥

వ॥ ఇవ్విధంబున నాశ్రిత జనవత్సలుండును, కందర్పసన్నిభ సుందరాకారుండును, దీనజనానాథ వంది జనబృంద బృందారక మహీరుహ సదృశుండు, వరసురనాథ వైభవోన్నతుండును, వైష్ణవ జ్ఞాన సముంచిత హృదయ పంకేరుహుండును, వననిధి సమగంభీరుండును, పుణ్యపురుషాగ్రేసరుండును పురజిత్సమాన శౌర్యుండును, భూరి మందర కుధర ధైర్యుండును, భగవదనంత కల్యాణ గుణామృతపాన పరవశమానసుండును, భాగవతోత్తముండును, సకల గుణాలంకారుండును, సరసిజాప్తాన్వయకరుండును నగు ఇక్ష్వాకు మహీకాంతుండు దుష్టజన నిగ్రహంబును శిష్టజన ప్రతిపాలనంబును జేయుచు రాజ్యంబు పూజ్యంబుగా సంరక్షణంబు సేయుచుండి యొక్కనాడేకాంతంబున తన స్వాంతంబున నిజ జనకుండైన వైవస్వత మనువుచే నుపదేశంబైన పాంచరాత్రాగమ జ్ఞానంబు దలంచి యిట్లని వితర్కించె॥

సీ॥ ఇలలో నరకపాతహేతువు దుర్విషయ
సంసక్తులై కామినీ సక్తులగుచు
నరబుజనాభ మాయామోహితాత్ములై
జనిమరణాద్యవస్థలను దగిలి

ప్రకృతికి శేషమై పరమకారణ పరబ్రహ్మ
స్వరూప సంబంధమెరవరు,
జాలక మైన సంసార వారాసిలో బడి తేలి మునుంగుచు కడమొకింత
గానవేరక తిరిగెడి మానవులు ని
జాత్మ హితములు దలంచక నజ్ఞులై రి పాపగ
కర్మనుగుణముగా బుట్టుచు నికి
యింతి యెచటాని లాభమెకింత తెదరా॥

కావునా॥

గీ॥ దేహసుఖము స్థిరంబని దెలసి ప్రకృతి
సంగము మానె యమునియమాసి సకల కర్మ
ఫలము తెల్లను హరికి నర్పణము జేసి
నిర్భరకహన సంధాన నిపుణమతినీ॥

కం॥ మహతాత భాస్కరుండును
హే తత్వజ్ఞాని యగుచు నరుని ప్రరికిసం
ప్రీతిని జని రంగేశ్వరు
నాతత మతి గొల్చి ముక్తి కహుండర మెచ్చెన్॥

గీ॥ తోదరి మంత్రి మైనస్వతుండు నట్లు
బ్రహ్మలోకంబు నకు జని పరగ నచట
రంగపతి సేవ జేసి నిర్వాణ పదము
గాంచె వాభాగ్య మెట్టులు గలుగు నాకురా॥

కం॥ పరమవ్యోమంబున నను
స్థిర విగ్రహ భంగి నున్న శ్రీ రంగేశుం
దరవిందోద్భవుని తప
స్సుఫలము నకు మెచ్చి వచ్చి పాలుపగ నిలబెన్॥

గీ॥ భూరి కారుణ్య నిధి మహా పుణ్య జలధి
నమిత భక్తార్తి సుజన ప్రసన్న మూర్తి
ప్రకట మోక్ష ప్రదాయి శ్రీరంగశాయి
కరతలామలకము వలె దొరికినప్పుడూ॥

గీ॥ అజుడు లోకోపకారార్థ మరసి ధాత్రి
యందు నిల్పకే తన లోకమందు నిల్చె
కేలియయి భూలోకవాసులైనట్టి మాన
వులకు నెబ్బంగి సిద్ధించు సులభముననూ॥

గీ॥ ధరణిపై నున్న రంగేశు దర్శనమున
కలిగెడును ధరణికి రాగలదు గాని
మనుజులే రీతి తనలోకమునకు వచ్చి
విమలుడౌ రంగవిభుని సేవింపగలడూ॥

కం॥ యింత ప్రయాసంబున నా
క్రాంతుడు శ్రీరంగనాథు గనుగొని తనసి
ద్ధాంతము నిల్పుకొనెగా
కింతైన పరోపకార మెరుగగ వలదే॥

ఉ॥ భూరి పరోపకార మతి పుణ్యమటంచు విధించి యుండె నా
సారస సంభవుండు శ్రుతి శాస్త్ర పురాణములందు నిప్పుడా
సార వివేక పక్షతులు స్వాంతమునన్ బరికింప దేల యూ
ధారుణి మానవావరులు ధర్మవిరుద్ధులంచు మూనెనెలూ॥

కం॥ కలుషాత్ములు ధర్మవిరు
ద్ధులు జడమతులజ్ఞులధిక దోషాత్ములు నీ
ర్మలుడైన రంగధాముని
దలచిన పరిశుద్ధులౌట తథ్యంబనుచున్॥

కం॥ తానే తరింప జాలెను
గానీ భూలోకమునను గల మానవ సం
తానముల పట్టి తరుణా
హీనుండై యుండెనిప్పుడే మనియుందున్॥

సీ॥ బ్రహ్మలోకంబులో నున్న రంగశాయి
పాద పంకేజ సేవ నెబ్బంగి గలుగు
మానిత జ్ఞాన బోధా విహీనులైన
యస్మదాది జనంబుల కరసి చూడ॥

మరియు భవిష్యత్కాలంబునందు॥

కం॥ నా పుత్ర పౌత్ర వర్గం
బ్బే ప్రథమని పాదముల జ్ఞానహీనజనముతి
కే పగిది బ్రహ్మపురమున
కేపున జని గాంచు శ్రీసహిత రంగేశున్॥

కావున॥

సీ॥ బ్రహ్మలోక గతుండైన రంగ విభుని
దెచ్చి సాకేత పురిని బ్రతిష్ఠ చేసి
పూజ చేసితి నేని యీ భూజనంబు
లెల్ల రంగేశు గొల్చి తరింప గలరు॥

కం॥ అని చింతింపుచు మనమున
దనురాగంబున వశిష్ఠునాశ్రమమునకున్
జని యమ్మునినాథుని పద
వనజములకు మ్రొక్కి నతడు ........ న్॥

సీ॥ ఆయురారోగ్యమస్తు కల్యాణమస్తు
భవ్యతర భోగ భాగ్య సంప్రాప్తిరస్తు

భగవదంఘ్రి సరోరుహం భక్తిరస్తు
యనుచు నాశీర్వచనములం జెప్పిన నెంసంగెన్॥

ఉ॥ చెప్పిన కార్యమే మనిన వార్ధిపరీత మహీతలేశ్వరుం
డచ్చుగ బట్టె నంత మునికులాగ్రణి రంగవిమానమూర్తికిన్
దెప్పున తలంపు బుట్టు ఘనధీర విమానములు మీరటించుచునె
చెప్పితి తద్విధంబిపుడు చెంచ్చన సేయక నానతియ్యవే॥

క॥ పావనము నుత్తుంగంబగు
భూమీరు శిఖరమునను బాలుపొందు ఫల
స్తోమములు గోరుకైవడి
నామది శ్రీరంగదర్శనము గోరుజుమీ॥

గీ॥ మీరు మద్ధురు ముచ్ఛుర్తై మేలు మనకు
విశదముగ జేయుచుండుట విశ్వసించి
అందరాని ఫలంబని యనక రంగ
నాధు దర్శింపగా గోరి నాడ నేను॥

క॥ సురుచిర రంగవిమానము
పరువడి నిర్ధరకల నప్పు పర్యంతము తా
మరపాకు నోటికైవడి
నరయగ చెలయుంపుచున్న దాత్మ మహాత్మా॥

వ॥ అనిన విని యతిప్రహానను బ్రావ్యంధతి కేరుకాంద్రక్
దృష్టి నవలోకించి యువ్వంగా కా యని తన వెరుగ దృష్టి
నతీతానాగత వర్తమానంబులైన సర్వంబును దెలిసి
ఇక్ష్వాకు నామధేయ భూమినాయకున కిట్లనియెం॥

క॥ వైవస్వతనందన నీ
భావంబున దోచినట్టు భవ్యవిచారం

చే విశ్వమందు జూడగ
పావనమతి శుభకరంబు భవహర మెన్నన్॥
క॥ రాజోత్తమ నీవు తపో
వ్యాజంబున బడయుము నిఖిలైశ్వర్యంబుల్
రాజర్షిత్వ పదంబును
తేజంబును పొంద రాత్రి దీయుతు మతివై
గీ॥ అఖిల ధర్మార్థములు దెల్పు చలరు ఘనపు
రాణములనేని యు ధర్మంబు రాజముఖ్య
నీ మనమునకు దాచె సన్నిహితమగుచు
నెట్లునిన నీకు దెల్పెద నిపుడు ప్రీతి॥
క॥ శ్రీ రంగరాజ దర్శన
మూ రాజీవ భవ పురమునం దెప్పుడుం దో
పాటికైనను గలుగదు
ప్రేమతో నీకు నది లభించును వేగన్॥
తత్ప్రకారంబు వినుము॥
సీ॥ నీవు దుస్తర తపోనిష్ఠచే నున్నను
కమలాసనుడు గడు సుముఖుడగుచు
రంగదుత్తుంగ వరా రంగ విమానంబు నెయ్యం
బెలర్ప నీకియ్య గలడు
నీవీ యయోధ్యను నిలిపి పూజింతువు
నీ వంశమునను జనించి పిదప రాజులు పెక్కండ్రు పూజింపగలరంత
రామనామమున నారాయణుండు
మీకులంబున బుట్టిన మేటి దశరథావనీశు జఠరమున నవతరించి
అఖిల లోకోపకారియై యలరు రావి

కౌ సుంఢ్రీశుడురమున హతము జేసి॥

గీ॥ వాని పిన్నతంమ్ముడైన విభీషణుని
నకలంక ఘూర్ద్వహుండు నియమెసంగ
లంకనొసగి విూంకలధనవతారంగవి
వూని మెసగు నప్పుడనూన కృపను॥

కం॥ ఆతడు కావేరి తటిని
నీతీర ధరాస్థలమున నిలుపు నెలమి త
ద్భూతలమున కల్పాంతము
ఖ్యాతిగ వసియుంచు రంగపతి యురుచక్రతుడై॥
ఆ తరువాత పంకజభవాలయు శ్రీముకుంబోయి యుమ్మృటన్
దాంతమెునబున్ నచ్చనలు తప్పక గైకొను విధంబునన్
ఖ్యాతిగ కల్పకల్పమున నట్టి వికిన్ భువికిన్ దిరంబుగా
ప్రీతిని రాకపోకలానరింపుచు రంగవిమాన మెప్పుడున్॥

చ॥ తెలగునను పంకజాసనుడు బెల్లిన పిమ్ములు తద్విమానమిం
పెలయు పరాలయంబున కునేగును దక్షిణదేశవాసులన్
లతినికవేరజాతటంతలంబున బుట్టిన సర్వజంతులన్
నలువుగరతంగభక్తకరుణారసమెప్పగ బ్రోచు నెప్పుడున్॥

గీ॥ జ్ఞానహీన జనులు సంసారమగ్నులు
నధమకులులు పాపులైన గాని
రంగనికట భూతలంబున గల సర్వ
జంతుతతులు ముక్తి సరణి గాంచుం॥

కం॥ సందియము లేదు చూడగ
కందర్పగురుండు వకను నిరతంబున్
పొందుగ రంగనివాసుల

వందరితను జేర్చుకొనను దయాళుం డగుచున్॥

సీ॥ తామస మతులు కృతఘ్నులు
నాస్తికుల్ కపటు మనస్సులు కఠిన హృదయు
లజ్ఞాన యుతులు శ్రద్ధా జ్ఞాన హృదయులు
[illegible] విపరీత బుద్ధులు చపల మతులు
కరుణా విహీనులు దురిత సంబంధులు కుత్సిత మతులు సుకృతార జనులు,
దారుణ కర్ములు చోర వర్తనులు గురుమంత్ర హీనులు క్రోధయుతులు
రంగ వాసంబు సేయ దొరంగి రోసి
కేడు రయంబున వచ్చి తత్కార్య మునకు
విష్ణువులు జేయుచుందురు శ్వేతలమున
బ్రహ్మ రుద్రాది దేవతా ప్రతతు లెప్పుడు॥

గీ॥ భక్తవత్సలు డగు రంగపతి కటాక్ష
మెప్పుడు తమ మీఁద వచ్చునో యెప్పుడు గాని
యూరకే రంగవాస మియ్యవ్వలోన
సంభవింపగ నేరదు జనవరేణ్య॥

పలుకులు వేయునేల వినుమా ధిక వర ముఖ్య మనంబులోపల
గలగక నీవు లోకహితకార్యము గా విమలంబు ముక్తిదం,
బల ఘ శుభ ప్రదంబు దురితాపహరంబు బుధానురంగమై
యలరు మదీయ దివ్య మహితాశ్రమ భూమి తపంబు సేయుమా॥

వ॥ శ్రీమదష్టాక్షరీ మంత్రరాజంబు జపంబు గావింప్రచు
తపంబు గావించితి వేని, నీకే పరిమితాపవర్గ ప్రదాయి
శ్రీరంగశాయి ప్రత్యక్షంబగునని యాజ్ఞాపించిన బ్రసాదంబని
సంతుష్టాంతరంగుడై యమ్మహాజటిశ్రేష్ఠుండగు
వశిష్ఠ మునివరు చరణారవిందంబులకు వందనంబు

లాచరించి యుత్తమోద్ధవ సత్త్వము చేననుజ్ఞాతుండై సకల
సంపత్సమేత యగు సాకేత కుంజని మంత్రి పుంగవుల యెడ
ప్రాజ్యంబగు రాజ్యభారంబు నిల్పి తపంబునకు దృఢవ్రతుండై
తన నిజ పురంధ్రి రత్నంబుతో డంగూడుకొని దృఢ చిత్తుండై
కాంతారంబు చని చనె॥

సీ॥ మందార పిచుమంద చందన కందరాళా శోక కదళీ పలాశములును
అంబుజ బదరీ కదంబ హరీతకీ నాగ మధూక పున్నాగములును
తాల హింతాల కపిత్థాల తమాల రసాల లవంగ తక్కోలములును
పారిభద్ర వకుళ పనస వకుళ కుటజ కేతకీ ఖర్జూర చూతములును
నారికేళంబులును కేరవీరములును । జంబు జంబీర ముఖ
వృక్షజములు గలిగి । చెలగి యొప్పొందుచున్న వశిష్ఠ నామ
తాపసాశ్రమ వనము ముదమున గనియె॥

వ॥ ఇట్లు పొడగని దాయంజని యప్పుడప్పుణ్యాతపోవనంబు
కైలాస శిఖరి శిఖరంబునుం బోలె । హైమవతీ నీలకంఠా
న్వితంబై । వైకుంఠ నగరంబునుం బోలె విష్వక్సేన సహితంబై
సత్య లోకంబునుం బోలె । బ్రహ్మ నారద శారదా విభ్రమంబై
అమరావతీ పురంబునుం బోలె । ఐరావత విరాజమానంబై
లంకా పురంబునుం బోలె । బహు పలాశ సంచారంబై
అలకా పురంబునుం బోలె । కుబేర నివాసంబై । సమ
ర చక్రంబునుం బోలె । సన్నాగ కలితంబై । హేలావతీ
నిటల తటంబునుం బోలె । తిలక లలితంబై । దశార్ణకమంబునుం
బోలె । ఘనసార తరంబై । క్షీర సాగరంబునుం బోలె ।
అమృత సమన్వితంబై । మలయ కుధరంబునుం బోలె
భుజగస్థాన స్థానంబై పుణ్య పురుష హృదయంబునుం బోలె

నతి విశదంబైన యమునా ప్రదేశంబునం బ్రవేశించి నిజపురంధ్రి
తిలకంబు బహువిధంబులం బనులు సేయ నిష్ఠాగరిష్ఠుండై
నవదశాక్షరీ మంత్రరాజంబు జపంబు సేయుచు నత్యుగ్ర
తపంబు సేయుచుండె॥

సీ॥ పంచాగ్ని మధ్య తప్త స్థలాసీనుడై మండు వేసవిలో ననుండు నెపుడు
శీతకాలమున నిర్భీతుడై కంఠపర్యంత మహాజల మధ్యమందు నుండు
జడి గొన్న వర్షావసరమున పైని యంబరము గప్పక బట్టబైట నిలుచు
కందమూలాదుల కాలంబు గడుపుచు నిరత మితాహారనియతి నుండు
నిర్విఘ్నంబున సతతంబు నవ్య సుంధర్ రాధినాదుండు
శ్రీహరి ధ్యానపహింత। హృదయుడై ఇంద్రియంబుల గదలనీయక
నచల భావంబులో నున్న యవసరమున॥

కం॥ బృందారకాధిపతి ముఖ
బృందారకులెల్ల మెక్కు బృందంబై యా
నంద విరహితాత్మకులై
తందరపడి యిట్టులని వితర్కించి రొగిన్॥

॥ ఈ రాజచంద్రుడే బృం
దారక పతి విభవమునకు తన డెందములో
గోరి తపంబానరించు నను
భారంబై తోచె నీ తపము మనకిపుడున్॥

మరుని బ్రేరించి యీతపస్సు రహో మెల్ల
నేపుర్ మెరయంగ విఘ్నమొనర్పవలయు
కానిచో నింద్రుహా త్మ్మని ఘనతపోగ్ని
యనిమిషాగార వితతులెల్లను దహించురా॥

కం॥ అని పృష్ఠ ధనుర్ధరు గనున

గాని యుండ్వం దని తెమె భ్రాంతి నుపి తాత్ముండై
యునపాత్రత్ర దుగ్ర మగు తప
మొనరింప నుండె నిప్పుడురివి స్థలిపై॥

కం॥ అని విషతతుల బ్బురపతి
గనుగొనగా భూరి వాంఛితాద్వైఖరితో
మును జోంత్రత తపోగ్ని శిఖల్
గొనకొనిం భువి నుండి తెగసె గొబ్బున దివికిన్॥

కం॥ కావున నో విప్రులతి
ధ్యాన పరుతప మెల్ల మాంస పృచ్ఛగ వలయున్
భావ భవ నోదు సతత్త్వరు
దేవ వహా మున మేము (బ)తుకు నట్టు లరయుచున్॥

సీ॥ నీ కటాక్షంబున నఖిల లోకంబులు
వాసిగా బుట్టించు వర్ధనుడవు
నిబిడతత పోధ్యాన నిష్టాగరిష్టు లౌ
మునుల మోహింతుల జోసిన ఘనుడవు
ముగురు మూర్తుల నోదు మోహనాస్త్రముల చో
దారా యుతుల జేయు నేరుపరివి
అఖిల లోకులను మాయా మోహితాత్ముల గావించుచున్నట్టి దేవరుడవు
కేలరే నీ సాటి వారలు లోకముల యందు
నిన్ను వినుతింప నేర్తుమె నీరజాస్త్ర
మామ మమో వ్యధలను మాన్ప మమ్ము బ్రోవ
శ్రీయుతాకార సహిత లక్ష్మీ కుమారా॥

వ॥ మదనా రాజీవోపల
శరదాకర దనజిత శంబరాస్త్రిత విలస

ద్వదనా సదనాయుత శశి
వదనా నయనారవింద వరగుణ బృందా॥

వ॥ అనిన విని రతీ వల్లభుం డుల్లంబు పల్లవింప సల్లలితోల్లాసంబు
న నెల్ల సురలు విన శచీ వల్లభునకిట్లనియె॥

క॥ అనిమిష వర ప్రసన్న నేతే
ఘన జెలగుచు నున్న యప్సరోగణములన
యెవ్వని బనుప్ప వలుటకేం వారల
వెనకనె జని నృప్పని తపము విఫలము జేతున్॥

క॥ ఫల దళ జల మూలాశన
ములఁ తప మొనరించు వతాని ముఖ్యులనైనన్
లలిమత్పంచ శరంబుల
గలప్రుదునే నృప్రుడు వారికేన్నను ఘనుడే॥

వ॥ అని వీరాలాపంబుగా బలికిన విని జంభారి రంభాదులగు
నత్సరో విలాసినీ జనంబుల రమ్మని యాజ్ఞాపించిన
యవసరంబునా॥

ఉ॥ అందెలు ఘల్లు ఘల్లనని జాంఘ్రి యుగంబున మ్రోయు మేనిపై
చందురుకావి దువ్వలువ చాయలు దేరగ కంకణ ధ్వనుల్
సందడి సేయ నెంమ్మొనల సన్నపు కస్తురి రేఖ బాహాలన్
సందిటు దండలొప్ప రభసంబున వచ్చెను రంభయత్తరిన్॥

సీ॥ చెన్నగా నుదుటిపై చెదరక్క బొట్టుతో
మెరపు కుంకుమ చుక్క మెరపు చూప
మురువైన చానాక్రాణి ముత్యంపు సరులతో
చెలుకల తాళి గుబ్బల నటుంప
రంజిత నూత్న పంకేజ రాగంబుతో నత్తకెం మోవి పైకైన మాద

జత గొన్న బావిళీ నదులు తాటంక ములఁ గండభాగములపై కదుపులీన
పాదమం జీరఝుంకారఝుంకారల్ బరిఢవిల్ల
మెండి నేత్రావి తోడ సన్మిళితము గుచు, గమ్మకస్తూరి వాసనలగడలుకొనగ
వచ్చె నూర్వసి యనఁ వేల్పుమచ్చకంటి॥

ఉ॥ తోరపు గబ్బి గుబ్బ గవతో జిగి దేరెడు మోవి తావితో
బారు మెఱుఁగారించి తలసన్నవ హాటక భూషణావళితో
మారని శాంత హాసయుత సమాననిరీక్షణ లీల తోడ నె
య్యార వము తోతిలోత్తమ రయంబున వచ్చె విమానదమెప్పగన్॥

కం॥ మీనాంకుని విజయాంధర్వము
గా నెత్తిన రత్న హాటకపు టెక్కెము నన్
మేనక యని యడు నిజగర
మానిని చనుదెంచె నప్పుడు మదగజగతితో॥

సీ॥ లాలిత బాల పల్లవ సమాన రాజ్ఞ ముననున్న పూబంతి గొనబు మీర
నతులిత మోహ షోప మువదభ భరమున శిశి పువ్వారాగిడి మిసిమి మిగులుక
రాకా సుధాంశు నిరాకరించు చునున్న మోముచిరునవ్వు మొలకలెత్త
నలఘు పాదామనీ తులిత గాత్రంబు మేలిబంగరు కావి మెఱుగులీన
వసదు కౌను తిన సవం బాహులతికలు, కిసలయాధరము సమానకీరసదృశ
మధుర భాషా చమత్కార మహిమ దనర
చిత్రరేఖయు వచ్చె విచిత్రముగను॥

ఉ॥ కాంచన కంకణాకృణాని కాయము హాటక కింకిణీరవం
బ్బంచిత లీల మ్రోయ వివమాలాస్యము నర్చి చిరినవ్వు గుల్కగా
లాంచల దీధితుల్ పయిని యంచులు దేరగ ముజ్జగంబు
మోహించు విలాస వైఖరి ధరించుకొ వచ్చె ఘృతాచి వేడుకన్॥

వ॥ మఱియు ననంతంబులైన యప్సరోగణంబులు పరిచారికా

నివహంబులతో వచ్చియు నప్సరలందరు త్రిదశవరు నెదుట
నిలచి మ్రొక్కి రంతా॥

కం॥ యీగతి జనుదెంచిన సుర
నాగేంద్ర గమనల గని సునాశీరుడు మీ
రీగతి నయునన పాత్రుడు
మొగని రూఢముగ నున్న యుర్వికి జనుడీ॥

కం॥ జని మీ యందముల మనసలరిన
జననాథుడు మీమ్ము జూచి స్మరపరవశుడై
యనుపమ మగు తపమెల్లను
చనజేసి చలించు సరగ చనుత వేడ్కన్॥

కం॥ మీ వెంట వచ్చునో త
ద్భావజు డతి వేగ తనదు బలములతో మీ
రే విధమున నైనను ధర
కో వల్లభు మోహితాత్ము నిగ జేయ వలెన్॥

కం॥ అని విని రంభాదులు న
య్యనిమిష నాథునకి మ్రొక్కి యతి వేగమునన్
జని ఇక్ష్వాకు మహీరా
జు నిరూఢిగ నున్న వనము జొచ్చిరి పెలుచన్॥

ఉ॥ చొచ్చిన వారి పిమ్మట నిచోద్యముగా మదనుండు వేడ్కతో
పచ్చని వారువంబులను బన్నిన పుష్పశతాంగ మెక్కియున్
నెచ్చెలి యైన వసంతుడును నేర్పున జెంగట గొల్వ కోల్వ కో.
డచ్చుగ చంద్రికా సముదయంబున దిక్కులు గప్పి వెల్లగన్॥

కం॥ మలయుచ మారుండని మెటి
దళవాయి మహా ముదమున దగ్గర నడువన్

బల సన్నాహముతో పృథు
సుఖకులు ధరియించి మరుడు మొనకట్టి వెసన్॥

సీ॥ కిలకిల నాదయుక్ కోకిల సమూహములను
బలువైన వీరకాహళుల తోడ
ఝుమ్మని మ్రోయుచు కమ్మ పుప్పొడులాని
యలరెడు తేటి గాయకుల తోడ
పాంథ జనానీక భావ భయంకర కేలి హంస
వంద మరంగ ధూళుల తోడ
శారికా కీర మయూర భృంగాన్వి భకటు
సహిత వీరభట ప్రజముల తోడ
వచ్చి యిక్ష్వాకు ధారుణీ వల్లభుండు
తపము గావింపుచున్నట్టి విపిన భూమి
చొచ్చి నలు దిక్కులను గ్రమ్మి పెచ్చు పెరిగి
యుచ్చరల బరి కొల్పిన యుద్ధి ప్రమోద॥

కం॥ మరుడీగతి బరికొలిపిన
తరుణీ మణులా నృపాలు దండకముని యం
తరసోచిత భావ షరాముల
పరిహాసములాడుచును కేపటు భావమునన్॥

సీ॥ జారు పైటఁ గదించి జగతి తవెంద్రని
మెదురుగా వశియించు ముదిత యొకతె
వింత వింతల పుష్ప బంతులు చే
బూని సంతసంబున నాడు నింతి యొకతె
నీటు మీరగ చిన్న పాటు బాడుచు వీణె
మీటుచు విహరించు బోటి యొకతె

సందిటు దండలు సవరించుచు కానుచు
తత్తర పాటుతో వచ్చుతరుణి యొకతె
పరగ చెంతకేత్తె బిలుచు నెపమున కోకి
ల స్వరంబున బలుకు నెలంత యొకతె
యీ విధంబున నచ్చర తీవ బోండ్లు
పలు దెరంగుల క్రీడల సలుప్ప నెదనూ॥

కం॥ ధరణీ నాయుడు నిజకర
తరుణీ మణులందు వనలతా వృక్షములం
దురు పుష్ప గుచ్ఛముల యం
దరయగ నన్నింటు హరి మయము గాఁ జూచెన్॥

వ॥ ఇవ్విధంబున నిక్ష్వాకు మహీ వల్లభుండుల్లంబున
రమా వల్లభు నిడి నిశ్చల ధ్యాన పారాయణుండై యున్నం
గని మనసిజుండు చెంగలువ చెలి కాని చెంగట రమ్మని
పలికి శుక పిక నికరంబుల నిరుగెలంకుల నేటు వాటున
రమ్మని యాజ్ఞాపించి విమల హాసంతు వసంతు నంతట
నాక్రమించుమని నియమించి । దిట్టంబయి యిట్టిట్టు
గదలని మొనమొ పకరించి తానును తోప పుష్పకోదండంబైన
చెందంబు నలతాంత శస్త్రందనంబున నుండి॥

గీ॥ తియ్య విల్లెక్కు పెట్టి సందీప్తమైన
పుష్ప శరములు తచ్చాపమున ఘటించి
పింజె పింజె యగా ధీ పారం జలంబు
మీఱ నిక్ష్వాకు మీఁద జిమ్మెను రయమునా॥

అంత నా సమయంబునా॥

సీ॥ మానుగా విరిదెనె వానలు నానుచు

విమలలతాంతగుచ్ఛముల నూని
పూవుల కెమ్మని తావుల జొక్కుచు నల మావితరుల నీడలను నిలచి
మాటికి మన్మదోన్మాదంబులే ప్రబల పంచజాకరముల పజ్జదాటి
అశ్రాంత వతిత రతిశ్రాంత కాంతల ఘర్మ నిరంతర కణము లంచిక్
శైత్య సౌరభ మాంద్య ప్రశస్తి తోడ
గూడుకొని యొంగ హృదయ సుసంక్షుభితకారి
మైన చల్లని గాలి యెయ్యెనను విసరె
నవ్వడు మురియును మేనకాద్యబ్జముఖులూ॥

సీ॥ వెలువు బందురు కావిజిలుగు పయ్యదలలో
కులుకు గుబ్బల రంగు తళుకులీన
బెళకు చేడిశే వీలల నులకించు నెరిమించు
కలికి కన్నుల దాలు గడలు క్రొనగ
తొగవిందు నగుమ ముద్దు మొగమున జిగి
చిన్ని నగవుల తోడ చెనంగి వెలుగ
విప్పారు నెరిగవ్వ క్రొవ్వుల మొవ్వ టువ్వటికిని నీలికువ్వలీన
మేనిదీవెలువలు మారుమెరుగులిడగ
నరుణా బింబాధర ద్యుతులారప్రు నెరప
నడుము లుల్లాద జఘనము దలల్ తిదబడంగ
మందమంద గమన లీలలందు మీరా॥

క॥ ఆడుచు పాడుచు వేడుక
గ్రీడలు సలుపుచు నమంజరికేలసుమములన్
గూదంగొయుచు మదనుని
బాదబవుల భంగి బొంగి పలుకుచు చేరిన్॥

క॥ వరుఠింవ్యు మింరబరపిన

శరపంక్తులతోడ నెప్పుడు సమమున దగుభా
సురవిక్షణాముల నిక్షావ
కురహవల్లభుని జూచుకొనుచు జరింపన్॥

క॥ మరియును మరుడాబుక్ గొనుచు
నరవిందాశోక మల్లికాది శరంబుల్
బరపి బలంబుల నెక్కటు
బురికొల్పిన గొల్లు రనుచు భూరిరవములన్॥

క॥ చిలుకలు గొరవంకలు కో
యిలలంచలు శిఖితతులు ను భృంగంబులు మూ
కెలయు భయంకర లీలను
నలుదిక్కుల బలుకతన్ని నాదము చెవులన్॥

మ॥ విని భూపాలుడు నేత్రపంకరుహముల్ విప్పారగా విస్మయ
మువ్వనిలుస్త్రస్త్రధునిన్ వసంతుని సరోజారాతిన్ నిజకారం
గనలన్ గన్గొని మీనసంచయము వెచ్చె కాసారముల్ బోతి మొ
య్యన శంకింపక యుండె విష్ణుచరణా ధ్యానానురాగాత్ముడై॥

గీ॥ భూరిమహిమాతిశయనిర్వికారుడగుచు
తనయెదుట నున్న పూరుషాంగనల మూంతుర్
లన్ని పద్మాక్షపద్మాలయా స్వరూప
మనితలంపుచు భక్తియుక్తాత్ము డగుచుం॥

గీ॥ అష్టవర్గ పాద్యాది విధులచే నతిథిపూజ
సలుప వారికి భయము నాశ్చర్యలజ్జ
లొదవి నిష్ఫల్యతై వారలంకేల్ పెట్టు
యద్భుత విభ్రాంతచిత్తస్థలగుచు నప్పుడుం॥

సీ॥ అలవసంతుండు వనాంతరంబుల దాగి

సన్న సన్నక వేగి జరిగి పోయెను
గుండుచు కేందిన డెందంబుతో నరవింద విరోధి యందంద సురిగె
తనరూప మెల్లను గనబడని యున్నాక
రోదమాని మలయు మారుతము చూచి యెను
నతి భీతిచే రంభగతి దప్పి గడగడ వడకెను
తన తల వంచుకొని యెను. మొగి ఘృతాచియు సంతాపమున గలంగె
చెలువమగు మోము వెల్లన జోసుకొని తి
లోత్తమయు చిత్రరేఖయు నూర్వశియును
చేష్టలుడిగియు దీనతజెందిరప్పుడూ॥
మరియుం దమలో నిట్లనిరి॥

గీ॥ అకట ధైర్యంబు శాంత మిట్లుల రవలదె
సంతతము మెంగ నిష్ట వనాంతరముల
విపుల సుజ్ఞాన హృదయులై తప మొనరుచు
చున్న మౌనీశ్వరుల కని యుర్వి రీవి లోనా॥

కం॥ ఈ రాజు శమదమంబులు
ధారుణిలో నెన్న నద్భుతములై దగున
ద్వైరాగ్యంబగు నీతని
ధీరత్వాది గుణములను దెలియక యుంటిన్॥

కం॥ వఖ్యతి విని నిమిష మాత్రం
బ్బిబ్బట నిలుచుంటి మేని యుతని తపమునని
దబ్బగ జని యుంచిన పెను
చిచ్చైరచె సందడికిని జెచ్చెటూ దవ్వన్॥

గీ॥ ఈ రసాసా నాయకేంద్ర మనోరథంబు
తీల మీరగ నిపుడె ఫలింప వలయు

ననుచు సాశీర్వదించి నెయ్యమున నిజర్

రాంగనా మణులెల్ల దొలంగి చనిరి॥

ఉ॥ అంత పురందరుం డవేన్మరచి యస్త్రచయంబులు చెల్లఁగల్పి దో

రంతమునన్ నిరంతరము నందము మీఱుచు సన్నుతించి వి

ల్లింతయు మించు గల్గు సుభటావలి వెల్లను తాన సాచల

ప్రాంతములందు జేరి మనుజాధిపుతో తలవంచి యుల్లమున్॥

చ॥ తివిరి జితేంద్రియుండవు గదే నృపసత్తమ నీవు నీ తపంబు

విరళభంగి సిద్ధియగు నయ్యె హృషీకజయంబు సేయగా

దవిలిన వారలింద్రియ వితానము చేత మహోటి పిమ్మటన్

భవజలరాశిలో మునిగి బాముల నొందుచు నుందురెప్పుడున్॥

చ॥ గురుతుగ పతాని వర్ష్య లోక కొందరు భూరి తపంబు ధాత్రిపై

నిరవుగ జేయుచుండ్రు నజు నంతురు గాని యొకించుకైన దు

స్తరుతగు క్రోధుని గెలువ జాలరు తొల్లి శిష్యుండు సంయమిని

భృక్రగతి గెల్వ బూని నను బాయని క్రోధుని చేత తా నెలగెన్॥

కం॥ గెలువంబడి యొనను జేనను

మెలవిని క్రోధుని సహాయు మెవేళను ని

శ్చల మతి జేసుకొ బ్రహ్మా

దుల గెల్చితి హరియు దక్షుడు రిత విరహితా॥

కం॥ కావున నరపిత్ర దైత్య సు

రావళులను నాకు లోకు వని యొరుగుము ని

భావాంబు రుహాంబునయం

వైవస్వత మనువు కుమార వరగుణ ధీరా॥

కం॥ శ్రీ॥ శ్రీ॥ శ్రీ॥ ఆ క్రోధుండను నేసను

శత్రుని కింకరుల మాను సహాయ ధికుతో

చక్రాయుధుఁడా సుదర్శన ప
రాక్రమము మునఁ గెల్చితి వివిధంబుగ నమ్ముచున్॥

గీ॥ భవదభీష్టంబు సిద్ధించు భవ్యమగుచు
ననుచు నా నిక్ష్వాకు నీ ధ్యాని మనసిజుండు
సపరివారంబుగా బోయి సర్వరథి భవత్
తెల విన నాన్వితర్ మెరిగింప బలవిరోధి॥
కోపఘూర్ణిత మానసుండై యతిశీఘ్రంబునా॥

సీ॥ తేవి మాంరంగ సైరావతారూఢుడై
కౌల నమారంభు వాలు బూని
సకల నిర్జర కోట్లు సరవి నిదసు గొలువ
మను తనూజుని యూత్ర మును నకేరుగ
నప్పుడిక్ష్వాకుల ధరాధినాధుండు దేవేంద్రుని కాంతి ధ్వాత మయ్యావలయు
జనిస మను కెట్టు మెయిన్ననరోచు నప్పుడా
క్రోంత రెక్కలు పిండి పిండి సేయు
దండి మగ డుగ్రుడైన దొత్తమున మీంద
తాను బట్టిన వజ్రాయుధంబు వైవ
నదియు మంటలు మిణుగురుల వనె మిన్న
గప్పి పెళ పెళ నార్చుచు దిప్పు మీరా॥

వ॥ నిఖిల బ్రహ్మాండ భాండంబు నిండుకొని యుద్దండగతిం
గనయుటయును॥

చ॥ మనసు సుతుండించుకైన తన మానస మందు దలంకతర్ జనా
ర్దన కరవర్తి దుర్జన వితాన మనోభయకృన్మహార్తిర్
సజ్జన నుత భవ్యమూర్తిర్ విలసద్రుచి పూర్తి నితాంత కీర్తిమై
దనరు సుదర్శనంబు నకు దప్పక సంస్తుతి జేసె నెమ్మదిన్॥

ఉ॥ అప్పుడు నూరుకోట్ల కవులాప్తుల తేజముతో సుదర్శనం
బప్పుడు విలంఘనుడున్న విపినాంతర భూమికి వెళ్ళి వారలతో
గుప్పున వచ్చి నిల్చి నను కుంఠితమై శతకోటి బాధలె
న్నిప్పుల కుప్ప వేడిమికి నిల్వని మెర్వడుం ఖుర్వ
బాడప్పనన్॥

అప్పుడేమి యనసెల్లక

కం॥ మంగళ సహితంబుగ శ్రీ
రంగమహాధామమును బురాజేంద్రుడు
ప్పొంగుచు నిప్పటి వలె తప
మంగుగ గావింపుచుంటె నతి నిశ్చలుడై॥

కం॥ లజ్జిపడి ఇంద్రుడప్పుడు జ
గజ్జననాధుడగు బ్రహ్మకడకుం జనితా
నిజ్జడదెలియు జెప్పిన
నజ్జాత మొకింత దడప్ప హాపాత్మకుడై॥

కం॥ తేనన్నెఱిసి మిడి మూసి తత్రము మదు దెలసి
రంగధామంబు కొరకు మాతాకాంత పాత్ర
డోవర తపమొనరింపుచున్నవాడ
టంచు నెను మూర్ఛ బాపె నయ్యావ పరముగా॥

గీ॥ అంత మూర్ఛ దెలసి యబ్జాసనుడు సుర
నాధు గూడి రంగనాధు చెంత
కరిగి భక్తి దమెరగిన రంగేశు
డతని జూచి యుట్లు లనియె బ్రీతి॥

మం॥ తన యూనీకుల విభారమె మిటికి సంతాపంబులచే గుందగా
పనిలేదిప్పుడు ప్రాతరర్చనము సంభ్రమ్లీల గావించితో

మను పుత్రాగ్రణికిన్ బ్రియంబుగను బ్రేమన్ వేమ సాకేతపున్
జని యచ్చోటి చతుర్యుగంబులు నిజేచ్ఛన్ నిల్చి యుండె నిమ్ముగన్॥

గీ॥ ఉభయ కావేరి నడుమ నను శుభద మైన
చంద్ర పుష్కరిణీ తీర జగతి యందు
సప్త మన్వంతరములుండి సరగ నిచట
కెరిగి నీవేతి యర్చన లందగలము॥

ఈ విధంబునా॥

తే॥ నీవు త్రికాలము భక్తిని
గారవించిన పూజ లెల్ల గైకొందు ననె
భావమున సంశయంపక
మా వాక్యము నమ్ముకానుము మహిత గుణాఢ్యా॥

సీ॥ వినుమెవ్వ డీ వసమునర్చన తోడ
యున్నను సంప్రోక్షణము ప్రీతి సలుప వలయు
షణ్మాసములు పూజలు సలుపకే యున్నను
తిరుగ విగ్రహము ప్రతిష్ఠ సేయ
వలయుం ద్రికాలంబుల జ సంభవనీకు మాయర్చనంబు నెమ్మది లభించు
గావున దోషంబు గలుగదు సర్వనాస్తికములైన దోషముల్ గలుగవింద
నిత్య మర్చించె దవ్వ వమ్ము నియమ నను
నీకు శతవత్సరంబులు నిండినపుడు
మోక్షము లభించును నిజముగా ముదమెలరగ
నీ విమానంబు నరపతి కిమ్ము వేగ॥

గీ॥ మగుడి విచ్చెద ననుచు రమాహృదీశు
డానతిచ్చిన వినికమలాసనుండు
సమ్మతించె తదంఘ్రి కంజాతములకు

నెలమి సాష్టాంగముగ నమస్కృతు లొనరిచెన్॥

క॥ శ్రీరంగ విమాన మమర
మీరంగ గరుడుని యుత్తమాంగమునను నై
న్నారంగ నునిచి తాను నమ
హా రయమున హంస వాహనారూఢుండై॥

సీ॥ వసుధ నిక్షేపకుల భూమ వల్లభుం డతి
నిష్ఠ హరిపదధ్యాన యుక్తాత్ము డగుచు
తపము జేయుచు నున్న విపిన స్థలమునకు
పక్షి భూనాధుని వాంఛితంబు
పలియుంచె శ్రీరంగపతి వచ్చెనె వేడ్కటుంచుచు
బల్కన విస్మయంబు హర్షన్
ములు వెంపడి జనింప మూచిన కన్నులు విచ్చె
రంగేశుని కచ్చెరువుగ నక్షణంబె ప్రదక్షిణ మాచరించి
లెక్క లేని నమస్కృతు లొక్క మొగిని
చేసి సద్భక్తితో కమలాసనకుని
నర్ఘ్య పాద్యాది విధులనె యర్చమున సి॥

గీ॥ లట్టుల దివ్యమాన మారాజ చంద్రున
కిచ్చి తన పురమున కేగె బ్రహ్మ
గరుడ సిద్ధ సాధ్య గంధర్వ గుహ్యక
పతులు బహువిధముల బ్రస్తుతింప॥

క॥ అంత సమర్చ్య పాత్రు డానంద భరితుడై
రంగధామము ముత్తమాంగమునను
దాల్చుకొని ముదమునన్ తన పురికి నేతెంచి।
యూర్ధ్వ వశిష్ట నను మతమున నా॥

సీ॥ సరయూనదీతటస్థలమున గోపుర
ప్రాకార ఘన మంటపములు చాల
వరివిగా కట్టించి వెలయ నాచుట్టును నవరత్నాది రుచులకు దివ్య
మహనీయ తపనీయ మందిర వితతులు నిర్మించి యచ్చ నియమమెసగ
శ్రీరంగవరు (బ్ర)తిష్ఠించి ప్రాజ్ఞులౌ శుద్ధమున తిరునాళ్లకు మొదలు చేసి
రూఢి రంగేశ్వరుని ధ్వజారోహణంబు
చేసి నిత్యోత్సవంబులు భాసురముగ
నెగిని గావించి విమల రథోత్సవంబు
వేడుకలు జనులలరగా గావించి మరియు॥

గీ॥ అవభృతస్నానము త్తరయందు జేసి
యదిమొదలు నిత్యనైమిత్తికాదులందు
తప్పరుండయు కామ్యపార్థంబులైన
యుత్సవంబులు సేయింపుచుండి మెప్పదలం॥

కం॥ తప్పక నను త్రికాలంబున
లోప్పగ జేయింపుచును నప్పోప్పల నాధుం
దప్పుడలు మిబహు దినంబులు
చింప్పగలాలింపె జనులు విసుతులు సేయన్॥

ఉ॥ ఆతడు నాతతప్పుల మునందు క్రమంబున బుట్టి నట్టి ధా
త్రీతలనాయకోత్తములు చిత్రియ భక్తిని రంగధామునిర్
భ్రాన్తిక బూజసల్పి త్రిజగన్నుత వైభవయుక్తులై సదా
పూంత చరిత్రులై శిరుల బొల్చి రసాటి నృపుల్ నుతింపగన్॥

అంతా॥

కం॥ పంచమ త్రేతాయుగమున
వంచితవముగ తత్పులంబు నందజునికి జ

ష్ఠించిన దశరథ భూవరుఁ
డెంచుక కొదలేక ధాత్రి నేలుచునుండెన్॥

కొన్ని దినంబులకు॥

సీ॥ అద్ధరాజాని పుత్రార్థియై యశ్వమేధము
జేయఁగాఁబూని ధరణిలోని
రాజుల నెల్ల రావించు నప్పుడు ధర్మవర్మాఖ్యుఁ డన ధరణినాధ
చంద్రుండు చోళదేశపతి
సమస్త నృపులతో సాకేతపురికి వచ్చి
యాయయోధ్యాపురమందు
కాంచ్యాశ్రమంతి అనటు నిత్యంబు రంగాధిపతిని
ఆర్చనలు సేయుటను తప్ప హాతిశయము
వరలు దశరథ నృపయాగ వైభవమును
గని మనంబున విస్మయకౌతుకము దగుచు
నెలమి తనలో వితర్కించె నిట్టులనుచు॥

గీ॥ తొల్లి ఇక్ష్వాకు నృపవరుం డుల్లమలర
తపము గావించి శ్రీరంగధామము ముప్పదు
వలన బ్రహ్మచేత బడసిన నాఁటనుండి
తత్కులంబున బుట్టిన ధరణిపతులు॥

గీ॥ ఆయురారోగ్యవంతులై యలరుచున్న
వారుగా వృవనేను వారియట్లు
తిరవిరి నిరతంబు భుక్తిముక్తిప్రదుండునైన
రంగేశుఁ బూజింతు నని మదమునా॥

అని యిట్లు నిర్ణయంబు చేసుకుని యుండె॥

క॥ ఆ మఖము పూర్ణమగుతరి

తామరసాక్షీశతుల సుధాపాథిర సంధా
ధామ మగు దశరథాధిప
చే మన్ననలందె తనదు సీమకు నరిగెన్॥

గీ॥ అవ్విధంబున ధర్మవర్త్మాభవ నృపతి
నిజప్రతీవరమైతగు నిచుళ యనె దం
పట్టణంబున కేతెగి సద్భక్తి గదుర
రంగధాముని తన యంతరంగమున నసూం॥

గీ॥ పిలుపుకొని మంత్రివరులను బిలువబనిచి
వారితో నిట్టులనె రంగవరుని దర్శ
నంబు చేసితి సాకేత నగరమున నను
తన్మహిమ సన్నుతింపగా దరమె భువిని॥

క॥ ఆ రంగధామ మెరుగా
సారముచే సూర్యవంశజనపతులెల్లన్
భూరితరైశ్వర్యముల యు
శోరాజిత మూర్తి వైరి శోభనమెసగన్॥

క॥ ఆ యిక్ష్వాకుని వలె తప
మోమెదగా వింతునేను నెలమని లక్ష్మీ
నాయకుడగు రంగేశుని
నే మెద బూజింతు ననెడి హితమతి దనర్॥

క॥ అని పలికి రాజ్యభారము
నెనరొప్పగ వారి యడదసు నిలిపి ముదముతో
జననాయక పిలకుండు తప
మొనరించుటకొరకు సుస్థిరోత్సాహమునన్॥

గీ॥ చంద్రపుష్కరిణీ తీర చారు భూమి

కలిగి యతి నిష్ఠతో తపమాచరించు
తఱిని యుత్కృట మహామునుల ధర్మవర్త్మ
గాంచి యిట్లని పలికిరి కడు ముదమున॥

క॥ జననాయక నీవు తపం
బొనరించుటకై యిటు పోతు వృద్ధది యునివర్
మునులార వినుండి క్షోణి
కుని వలె నేతపమొనరిం కేలతుక వెలపరన్॥

ఉ॥ రంగ దివమానవమున్ బడసి రంజిల పూజలుచేతు మారలు
సంగతి కానతి యిట్టి తన సంయమములాన్న పచంద్రు జూచి శ్రీ
రంగని మిత్తమై తపమరణ్యములో బనితోడు నేయుగా
అంగుగ నీవు నేమునివరా కృతి మానసము రాజశేఖరా॥

గీ॥ దీనికొక పూర్వకథ గలదో నృపాల
యిచటికొక క్రోశమాత్రాన మెదుము గలిగి
పొసగు నొక పట్టణంబు మా పూర్వులందు
నుండిరి పృదది ఖిలము యున్నదచట॥

క॥ మును వారి వంశంబున బు
ట్టిన భూవరు డెుకని ఘన కరిన కోపితుడై
కనక గిరి చాపధరుడా
యన్నన భ్రష్టము చేసె లోచనాగ్ని శిఖలచే॥

గీ॥ అందుచే తత్పురము ఖిలమయ్యెగాని
యుత్తరంబున కనకకోశోజ్వలుండు
ఘన పులస్త్యని శిష్యుండు వినుత శీలు
డైన దాల్భ్యనఖ్యుని దనెడి మహా తపస్వి॥

ఉ॥ ఆ ముని సత్య ధర్మమను నాశ్రమ భూమి తపంబు సేయుచున్

నయమొప్ప కావేరి నడుమ నున్న
సైకతస్థలమున సరవి చోద నంనంత పీఠంబు నందతి ప్రీతి నిలుప
నప్పుడు నన్ను మీ రందరు సేవించి
స్థిర మనోరథ సిద్ధి జెందగలరు
యందువల సందియము మీ కింతేదని
యానతిచ్చి మురారి దేవేంద్ర ముఖ్య
సకల దిక్పాలకులు మహాసంయములను
గొలువ వేంచేసి నర్క మండలము దనక
వెస మును లరిగితి మతని శ్లోకించు కొనుచు
నప్పుడు సూర్యుండు మా కిట్టులని యెనరెలుక్॥

క॥ మునులార విచారింపను
బని వేదిక తొల్లి నేను పద్మజు పురికిన్
జని రంగపతి పదంబుల
గని మ్రొక్కెను తెంచ్చి పిదప కడు నిట్లంటిన్॥

క॥ మా వంశంబున బుట్టిన
భూవల్లభ తతుల చేత పూజల నొనయున్
దేవేశ్వర మీరలు గొన
గావలయును కరుణతోడ కంజదళాక్షా॥

చ॥ యిదమ దభీష్టమంచు నుతి యించిన నంత ప్రసన్నమూర్తియై
సదయుడు రంగశాయి నను సయ్యన గన్గొని పద్మనేత్ర నే
పదిలముగా నయోధ్య యను పట్టణమందు భవత్కులంబునం
దుదయము నొంది వెల్గెదు నరోత్తమ సంఘము నర్చనల్॥

కొన్ని దినంబులు గైకొని యంతట॥

క॥ కావేరి మధ్యమునకు

ఘాతము చేసి మమ్ము నఖిల సురల
గావగలడు సమ్మోదము దయతో భయ
మెల్లబోవజేసి యుద్ధచరితా॥

సీ॥ అసురాధినాయకుండగు విభీషణుడు
శ్రీరంగ విమానంబు రమ్యముగను
గైకొని యుంకరాగలడిది సత్యంబు నమ్ముము
నా మాట మాటనె నమ్ము మనమున
నీవతి ముదముతో నిజపురంబున కేగి
సుఖమున రాజ్యంబు సేయుము
చండము రావణ సోదరుండిచటికి
వచ్చినతఱిని భూవరలలామ
పిలువనంపెద మేము నిన్నెలమితోడ
ననుచు ఋషిపుంగవులు జెప్పినట్టి మాట
లాలకింపుచు ధర్మనామాహ్వయుండు
నిజపురంబున కేగె ననుజన్ముతోడ॥

శా॥ అంతన్ గొన్ని దినంబు లేగిన సురామాఖ్య ప్రద్మాలయా
కాంతుండా దశకంఠు కంఠములు సంగ్రామస్థలిన్ ద్రుంచి యు
త్స్వాంతామోదముతోన నయోధ్యకు నయంబారంగ నేతెంచె సం
హ్వాంతుండై హయమేధయాగ ఘనదీక్షాయుక్తుడై యుత్తరిన్॥

సీ॥ పృథ్వీశ్వరుల నెల్ల బిలువనంపిన
వారలేగెడు వేళ చోళాధినాథు
డగు ధర్మవర్మాహ్వయుడే నాథుండు
తదనసేనాధ్యుల వితతులతోడ
గూడి యయోధ్యకు వేడుకతో వచ్చి

యశ్వమేధాధ్వరము చేయ జూచి
దశరథాత్మజుని చెంతగు బహుమానంబు గాంచి
యనుమతి నందిగదలి తనదు
పురమునకు వచ్చి రాక్షసేశ్వరుని రాక
కెదురు జూచుచు నతనికి నెలమి శ్రేయ
కొరకు వస్త్ర వచనంబులు కొన్ని గూర్చి
మరియు పెక్కైన పూజోపకరణములను॥

క॥ సారెకు నెనగూర పురోచు శ్వ్రం
గారంబున శిల్పశాస్త్రకారుల చేతన్
నేరుపున వంటప పాత్ర
కారంబులు గోపురములు గట్టించి వేసన్॥

గీ॥ వదనం కూలంబులైన సాధనములెల్ల
ఆవెలితి తీర్చ నమర్చి సద్వస్త్ర వరుల
చెంగట నునిల్పుకొని రాజశేఖరుండు
సారెకు రంగపతి రాక కోరుచుండె॥

సీ॥ అటు యయోధ్యాపురమందు శ్రీజానకి
కాంతుండు రవిజాదికపి వరులను
భవ్య కృపామతి బహుమానయుతుల
గావించి వానరములను వీడుకొల్పు
తదనంతరంబున దశముఖావరజుని
బహుమానమొనరించి పరగనంపు
లంకాపురమునకుల్లాసంబుతో బోయి యచ్చట
రాజ్యసుఖంబులనుభవించి
మంచయునరనతంబు నేవుడని మరువ

నుండుమని పల్కినను దనుజోత్తముండు
కరయుగము మోడ్చి భక్తియుక్తముగ మ్రొక్కి
వినయమున నిట్లనియె రఘువీరుతోడ॥

కం॥ నీ చరణా సేవకేన్నను
నీ చెంత వశించి యెలమి నిందగు నంటెదె
భూచక్రంబున గలదే
ప్రాచుర్యంబైన భూరి పదవి మహాత్మా॥

కం॥ నినుబాయ జాలని మనము
నన్ను నీ సన్నిధిని నిల్పి నయ మొప్పగనే
యనవరతం బామతి బ్రోవుము
వనజాప్తాన్వయ పవిత్ర వారిజనేత్రా॥

కం॥ లంకానగర మొకాదల
పంకేజభవకు వామకేంద్ర భవనములైన
శంకరు మందిరమైనని
రంకుశశి భవంబులైనన వినాకేలం॥

గీ॥ అఖిల భువనంబులేలు సౌఖ్యమునకన్న
నధికమై తోచుచున్నది యస్మదంత
రంగమున నత్వదీయ పదారవింద
యుగళ సంసేవనంబు భవ్యోత్సవముగా

వ। మరియు నత్యంత సంతోషకరంబుగా నిచ్చోట బరమపద సౌఖ్య
ప్రదాయి శ్రీరంగశాయి సందర్శనంబును। భవదీయ
సేవయుం గావించుకొని యనవరతంబు సుఖించియుండుదుం
గాని। లంకానగరంబున కరుగ నొల్లననిన విని మందస్మిత
వదనారవిందుండై రఘునందనుండతని కిట్లనియె॥

గీ॥ మెనసి యాచంద్ర తారార్కముగ నిందు
లంకకధిపతి జేసితి ననిని విమన్న
నదియు నీవల్ల ననిన బొంకైన గాదె
వసుధలోపల మత్సత్య వాక్యమిప్పుడూ॥

వ॥ అని గాఢ్వన మొక్క విశేషంబుగా వించెద వినుమని యుల్లడి వెం॥

కం॥ శ్రీరంగవిమానము నీ
వారాధిక నిత్యనుత్తమాంగంబున నిం
పారగ ధరియించుకొని లం
కారాజ్యంబునకు నరిగి కేడు రయము మెలప్పన్

కం॥ శ్రీరమణీమణి నురమున
గారవమున నుంచుకొని జగదవనుదవగు నీ
శ్రీరంగేంద్రుని గృహాతిరు
వారాధన జేసుకొని నయంబుగ మను మా॥

అని యానతిచ్చినం (బ్ర)సాదంబని విభీషణుండా రఘు
వరునకు సాష్టాంగ దండప్రణామంబులాచరించి బహు
విధంబుల స్తోత్రంబులుగా వించుచు తత్సేవాపరాయణులం
డై యుండె॥

సీ॥ అంత వసంత కాలాగతంబైనట్టి
తరి మీనరాసి భాస్కరుడు జేరు
మహనీయ ఫాల్గుణ మాసంబునను
బ్రంహ్మతారయందున స్థిరవారమునను
శుభలగ్నమున దైత్యసూదనుండగు రఘు
రాము భక్త క్ష్మా విశేష కులంబు వారి
కులధనంబగుచు జెంపలరు రంగవిమాన

మఱసి జశాస్త్ర పాదగుడకొసగ
నాతదవ్విమాన మమర శిరమునన
లంకరించుకొని ఇలాంత వేశు
నతడు నవస్మరించ్చి నలుగురు మంత్రులు
దానునచటు నుండి దరలె నెలమి॥

వ॥ అవ్విధంబున మంగళప్రదంబగు రంగవిమానం
బుత్తమాంగంబున నిడుకొని, విభీషణుండు మంత్రులుం
దానును గగనమార్గంబున లంకాభిముఖుండై గ్రామ
పుర పర్వతారణ్య సరోవర సరిత్సముదయంబులుం గడచి
కావేరీనదీసమీపంబునం॥

క॥ అతివేగమరుగు నప్పుడ
నతనికి మధ్యాహ్న సమయమైనను పూంజా
పతి ప్రీతిజేయ వలెనని
మతి బుట్టి నచట నిలచె మంత్రులు దానున్॥

వ॥ ఇట్లు మధ్యాహ్నకాలార్చనలు విధి ~~[illegible]~~ వంతంబుగా
సలుపంగోరి, కలుష సంహారంబగు నుభయ కావేరీ
మధ్యంబున నున్న చంద్రపుష్కరిణీ తీరంబున
నిశాంతానంత పీఠంబున ముముక్షుజనవితాన
సంతానంబగు శ్రీరంగవిమానంబు సంస్థాపించుటయు
నప్పుడు ధర్మ్యులు మహామునిగణంబులు ధర్మనిరతుండైన
ధర్మవర్మ కెఱింగించుటయు, నమ్మహానుభావుం డతి
శీఘ్రంబున, వేదవిదులైన విప్రనికరంబులతో జనుదెంచి
మహానందహృదయారవిందుండై విప్రుడు మద్గుర
భాషణుండును, విష్ణుభక్తి తోషణుండును సద్గుణ

భూషణుండును నైన విభీషణునకర్ఘ్యపాద్యాదిపూజ
లాచరించి యతండును ధరణీవరులును మునిగణంబులును
దానును రూపవిజితకోటికాముని తేజోధాముని
శ్రీరంగధాముని సేవించి రివ్విధంబున నతి భాసురంబైన
ఫాల్గుణ మాసంబున నపరపక్షంబున రోహిణీ నక్షత్రంబున
స్థిరవాసరంబున వాచస్పతి యుతంబైన శుభలగ్నంబునను
భకావేరీ మధ్యసైకతస్థలంబునందు ప్రశస్తరీతీరంబున
బ్రానవిమానంబగు శ్రీరంగవిమానంబు భూలోకంబునం గల
విష్ణుభక్తాగ్రేసరులకును భూసురులకును భూమిపాలురకును
దేవలోకవాసులగు దేవతాగణంబులకును జూడ నందంగా
విచిత్రంబైన రాజపుంగవులను మహాదైత్యేంద్రంబులు
దివ్యసుభప్రాప్తులను అభివృద్ధి యొందఁగలుగుచుండునట్లై
శ్రీకరంబుగా ప్రతిష్ఠితంబై నిలచె॥

క॥ అని యీశ్వరుండు చెప్పిన
విని నారదమౌని యతని వృత్తాంతమె
ల్లను గలుగా నాతి మన్నని
వినయమ్మింతు దగుచు మగుడ దేవుఁ గొనుచుం బలుకున్॥

చ॥ నిరుపమపుణ్యశీల కమనీయగుణాకర శత్రుభీకరా
శరధిగభీర సంతతయశస్స్ఫురసాంబుజనాభ భూస్వరా
పరమకృపాళువాలకల పావనసత్త్వవిసంచయాపనా
హరిపదపద్మభక్తిసముదంచితశీలనదీనపాలనా॥

క॥ రామానుజ గురువరపద
తామరస మరందపానతత్పరహృదయా
కామనిభరూప రాజన

భ్రామ్య చరిత్ర నీరనిధవనిధనేత్రా॥

తోటక వృత్తం॥

దారిత కైతలప ధర్మ చరిత్రా
సూరిజనప్రి సుందర గాత్రా
కారణ జన్మ జగన్నుత కీర్తే
సార వివేక విచక్షణ మూర్తే॥

గద్య॥ ఇది శ్రీ వల్లభ నారాయణ స్వామి కరుణా కటాక్ష వీక్షణ సంలబ్ధ సరస కవితా పాత్ర నాగేంద్ర గోత్ర పవిత్ర గుంటి పెల్లి లక్ష్మణాంబా సుపుత్ర శ్రీమత్కందాళ వేంకటాచార్య వర సత్కృపాపాత్ర సాధుజన విధేయ జగన్నాథనామధేయ ప్రణీతంబైన శ్రీరంగమహాత్మ్యంబను మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము॥

---

శుభమస్తు॥ అవిఘ్నమస్తు॥

శ్రీరంగమాహాత్మ్యమను చతుర్థాశ్వాసము॥

---

శ్రీ జానకీ ధవాంఘ్రిస
రోజ మధువ్రత వ సోజయాపాతిశయా
ధీజనకల్ప మహీరుహ
రాజద్వశ మకుట వకేలల లక్ష్మణ మంత్రీ॥

౧ అప్పుడరింపము పార్వతీధవుడు కేలాక్షి
నారద మునీంద్రు గని కరుణారసమున
నిట్టులని పెను విశేషణంబు దెలిపి తోడ
నంత మధ్యాహ్న పూజసేయంగ గదంగి॥

సీ॥ చంద్రపుష్కరిణిలో స్నానంబు గావించి
రమణీయ పీతాంబరములు గట్టి
నిలువుగా నుదుట తిరుమణి శ్రీచూర్ణ
ములు బాహుమూలముల సికా జలరుహాక్ష
మాలికలురమున మానుగా ధరియించి
సురుచిర ప్రసూనగ తులసి పత్రింద
వెలసిన భాగ్యాసనాసీనుడై యష్టాక్ష
రీ మంత్రజపము నరించుచు తానుచు
తెల్ల దామర చెందమ్మి నల్లగలువ
చిత్ర గలువలు పొన్నపూ తిరుగుడులను
పొగడపువ్వులు కలిగొట్టు పుష్పములను
మల్లెలను మొల్లలను తెచ్చి మదయు మందు॥

గీ॥ అమర దెప్పించి తులసీ దళములు గలపి
రమణ చిత్ర విచిత్ర భావములు గూర్చి
విమల కనక కలిశల తావేఱ నేరు
నించి శాస్త్రోక్త ధర్మ సమంచితముగా॥

గీ॥ అష్ట్యర్ఘ్య పాద్యాది విధులచే సంపూర్ణంగ
దాము పూజించి వేదశాస్త్ర యుతమైన
స్తోత్రములతా రచించిన స్తోత్ర శతక
మును నుతి పెక్కు విధంబుల వినుతి జేసి॥

వ॥ అసంఖ్యంబులగు సాష్టాంగ దండ ప్రణామంబులు గావించి
తద్దివ్య తీర్థ ప్రసాదంబులు భవహారంబుగా సకల
జనంబులను దానుసుజ్జీవించి కృతకృత్యుండై తద
నంతరంబున రంగధామంబు గొనుచు నిజ రాజధానియగు

లంకానగరంబున కరుగ నుద్యోగించు సమయంబున నా
ధర్మవర్మ యువ్విభీషణున కిట్లనియె॥

కం॥ మీరలు మాకుం బ్రియంబుగ
శ్రీరంగ విమాన మతి విశేషంబగు నా
వేళ తీర స్థలమున
కేళి మెయి నిలుపవలయు కొన్ని దినంబుల్॥

గీ॥ శ్రీ మహాభాగవత కుల శ్రేష్ఠుడైన
మీ సహవాసము జేసి యేము దుష్ట
రాఘముల బాసి పావన మానసు మిప్పు
డంచు వినయంబుతోడ బ్రార్థించుచుంటి యనుచుం॥

కం॥ విని దనుజ వల్లభుడు మన
మున హర్షము బొంది రాజ ముఖ్యునితోని
ట్లనురో పిక్ష్వాకు మాత్రము
దినము గడావ దవస్సే యుదీరదు నిల్వన్॥

గీ॥ ఆది ధ్వజారోహణ దినంబు నాదినమున
కతిరయంబున మా లంకకరుగవలయు
ప్రొద్దు పట్టు యుత్సవంబునకు వెడలు
సేయ వలెనని పలుక నా క్షితివరుండు॥

రాక్షసేశ్వరున కిట్లనియె॥

గీ॥ కోటి మీకు నే సఖుడ ప్రియుడ నదినా
పట్టణంబు రాజ్యభారమెల్ల [illegible]
మీది గాదె యేము మీవారలము గాదె
అన్నబుద్ధి సేయ నహర్ష మగునె॥

కం॥ మీ వాద దనుజ తలపు నా

పై నిలుపక యటు పఠించి పరమ ప్రీతిన్
గావింప్ర మె తదుత్సవ
మిం వేళను నా మనవికి మెదురాదకాగిన్॥

క॥ ఆ యుక్తి పెక్కు భంగుల
వినమొనర్పలు బలుక దైత్య విభుడలరి మనం
బున నిచ్చకొని యెనప్రద
జ్ఞ నసాధుడు చేరు వాని సంతోషము నన్॥

మ॥ ఘన కల్యాణ గుణాబ్ధి రాముని జగత్కల్యాణు నిన్ రంగధా
ముని తేజోయుత మూర్తిన్ సర్వదివిషన్నిష్ఠుం ధ్వజారోహణం
బా వరన్ జేసి విభీషణాఖ్యుడు ముదా మెప్పారగా పంచ
జాపస శిష్యాగ్రణులైన నౌ ధ్వరవు నేషా పంతులా మహా మలన్॥

॥ రుత్విజులను గావించు కో
సాత్విక గుణయుతులు రాక్షస ప్రభుడత్యం
త్తే త్వరిత బుద్ధి గలిగి ఘ
నత్వంబు గనుత్సవంబు గడు ప్రబలు చేక్కెన్॥

సీ॥ ప్రవిమల మాధుర్య బహుళ విధ భక్ష్యములు
పక్వ నానా విధ ఫల రసములు
నతిరసంబులు పాయసాన్నంబులు ననేక
గతుల బరిమళించు కరియ మధులు
వగ వగ బారులు వరలు పచ్చళ్లను బారి బారి
వాసించు పొంగలి యావియయును
లాలిత మాత్న ఎలాల వంగాన్నితా మిందంబు గలుగు దధ్యోదనంబు
మంగళంబైన శర్కర పొంగలియును
బారు సారభ్య మగు పులిహోర మొదలు

సకల విచిత్రా ... తతులు రంగపతి కప్పుడు
మనసు రంజిల్లగా నివేదన మొనర్చెన్॥

అంతా॥

సీ॥ హర్షించి సేతు శీతాచల మధ్యంబు
నందుండి వచ్చిన యువని సురల
కన్నంబు పెట్టించి యతులకు దక్షిణాలిచ్చి
యందరి చిత్తంబు లలర ....
ఘృత తైలక కర్పూర యుత గంధ బంధుర
హాటక కరదీపికా వళులును
పగలు వత్తులు నం సద్ధర్మ నిర్మిత పతాక
ధ్వజ తతులు ముత్యాల ఫలంబ్వి
తాంతు తత కాంత కుంభ సమంచితంబు
లైన నానుగులు భేరి మృదంగ పటహ
పణవ గోముఖ ఝల్లరీ ప్రముఖ హర్ష ధ్వ
నాద్యారవములు మొరయ భవ్యం బెలపాక్॥

కం॥ నా రంగ నాయకంబులు
నాటక నృత్యములు పలు సంగీతంబున్
కేళి వి మెఱయగా యుక్త
వారంబులు బాడ నతుల వైభవలీలన్॥

కం॥ తొమ్మిది దినంబు లీగతి
నెమ్మది నుత్సవము సతిపి రినిశ్చల నుతులై
యమ్మనుజ పతి విభీషణు
డిమ్ముగ దశమి దినమున నెలమి దలిపక్॥

కం॥ హరి దాసులతో తమరి

ద్ధరుఁ గూడుకాఁ వేడ్క నవభృత స్నానంబుల్
సరగున జేసి సురవిభుఁ,
డరయఁగ నెంక పక్ష దినము లచ్చట నుండెన్॥

అంత॥

సీ॥ స్వపురంబునకుఁ బోవ సమకట్టు
ధర్మవర్మావనీశునకు నెయ్యమునఁ జెప్పి
రంగవిమానంబు చెంగటకేతెంచె నురుకరంబుల బట్టి యెత్తఁ జూచి
మేరు మందర మహీ భారంబుకన్నను భారమై రాకున్న భయము నొంది
బలిమితోఁ బెకలించి పట్టి యెత్తను శక్తి చాలకున్నను మహాశ్చర్యమంది
అల రసాతల పర్యంతము వని గ్రుంగ
చరణయుగము మెట్టి పెదవులు గరచి చాల జగతి చిక్కఁగ
ద్రొక్కి మోంటిగల బడియు రెండు
చేతులతో గదలింపలేకె॥

క॥ కొంత దడవు మూర్ఛ గొని యెట్టకేలకు
మూర్ఛ దెలసి వెతల మునుగ మునిగి
అకట రంగధాముఁ డుక్రాంత శుభానము
బెడయు పాయమున వహింతు ననఘా॥

క॥ యిటుల మోసపుచ్చుటె రగనౌనింతైన
నెనెనరిక నటె వేర మేమి
యెపుడు మీకు వెంకనె దుగనె నన్నీల
నిమ్మబాయ గలనె నీరజాక్ష॥

ఉ॥ నమ్మినవాని ద్రోచుటది న్యాయము గాదు రమాహృదీశని
నమ్మినవారి కెన్నఁడును నాశము సేయవు నీవు భక్తులన్
నమ్మితి నేను వాదవని సారెకు వేద పురాణశాస్త్రముల్

నెమ్మి నుతింప నేను విని నిన్నని నమ్మితి రంగనాయకా॥

ఉ॥ ఎంటని మాటలాడెదని యెంచి యొకింత యశోయకేఁ జగ
త్కంటకుఁడైన రావణుఁడు దన్నిన శ్రీ రఘువీరుఁ జేరిన
ద్దంటసురారులన్ దునిమి తప్పక మిమ్ముల జేచెదన్ నన్నునే
బంటను నన్ను నేవిపుడు బాయఁగ నాయమె రంగనాయకా।

ఉ॥ ఇప్పుడు నీవు రానిదు దనింటికి నేగతి బోవ వాఁడనా
తప్పు సహించవే మురవిదారణ నిన్నెద బాయఁజాలని
న్పొఁదమి న్వరించిన మా రెవ్వరి పూజలు చేతు లంతలో
గుప్పిన రాగదె మదిని కోపము శోయక రంగనాయకా॥

చ॥ సరసిజ సంభవుండు గదు సన్నుతులం దపవర్గ చరింపఁగా
పరమపదంబు నుంతి యల పంకజగర్భ నికిన్ ప్రసన్నమై
పారదిగ పూజలందిన విశుద్ధచరిత్రుఁడవైన నీవు న
న్నార మురారి నేయ నా యమ మగుచాఁ ఫలదాయక రంగనాయకా॥

చ॥ మనుసుతుఁడా వశిష్ఠ వన ముఖ్యతపం బొనరింప వంశజాం
సమని పురంబునందె గడులీ యమునా వర్ప యెయ్యెడలో నవి
ఋషి వరుల ముఖ్యులైన ధరణీశులు జేసిన పూజ లెల్ల గై
కొనిన మహాత్మ రమ్మితే నను కోపము సేయక రంగనాయకా॥

క॥ తల్లియు దండ్రియు గురుడను
వల్లభుఁడును సకల బంధువర్గము లికమా
కెల్ల యింపులు నీవని
యుల్లములోపల నమ్మి యుంటిఁ గద యామ్నీ॥

క॥ నన్ను జూడకున్న దశరథ
తనయాగ్రజాని జూచి తెలినదా మోదరస
యున్న సరమ్ము నిన్ను నేవిద

కెలమి వి[illegible]నాడి ద్రుంచు వాకెందు గలరూ॥

క॥ భూతి దయాళుడవు మహో
దారుడవు సమస్త దేవతాధ్యక్షుడవే
తీరున నే మొర పెట్టిన
నీరకె దయ మాలి యుండుటుచితమె నీకున్॥

క॥ అని యిట్టుల విభీషణు
డను తాపంబు నను బొందియు వనిస్థలి వా
లెను ఖండిత మూలంబై
యున యుగ ధర బడిన ఘనవంహిం జంము భంగిన్॥

గీ॥ ఇవ్విధంబున రాక్షస హృదీశ్వరుండు
రంగనాథుని పదముల వ్రాలి శిశువు
పగిది నేడ్చిన గని రంగపతి కరుణను
మృదు మధుర భాషణంబుల నిట్టులనియె॥

క॥ మో వత్స వెవ్వు వెవ్వక
భావంబున చింతనేయు బనితేదు జగ
త్పావనుడవు మద్భక్తుడ
నీవిటు వగలన్నిట్లు యెడ్వదగునే॥

సీ॥ యిందున్న సూత్రవతీశుని కన్నను
పరగ నే శేషతల్పంబు కన్న
వరగుణాంత్యైన యూ వైనతేయుని కన్నన
మరుని పంచాయుధములు కన్న
వరలు నీకౌస్తుభ వనమాలికలు కన్న
భావింప నీరమాదేవి కన్న
మద్దివ్య [illegible] మంగళ మహిత విగ్రహము న

వెలుగు సద్భాషణావళుల కన్న
నీవు మాకు ప్రియుండవు నిక్కమిపుడు
నేను నీ పాద పద్మము నెమ్మనమున
మన్న నొందరదిపుడు ప్రేమమున నీవె
తోం ప్రుక్ పెంరయంగనిగి మెనగుంపక్ వలయుం॥

అదెట్లన్నను॥

కం॥ నవరత్న మంతికకుత
క్క్వగాం కిరుదెసల చుట్టుకొని ప్రవహించున్
ప్రవిమల కావేరి నది
యవిరతమును దీని చెలువ వలవే పొగడన్॥

కం॥ పున్నపు వెన్నెలకి నమై
తిన్నని సంద్రంపుటి సుక దెన్నెల బాలుచున్
మన్నందు పోక మాకులు
పొన్నలు పొగడలు నూతావి పూంపాదలింకెల్లన్॥

గీ॥ మావి మాతుకంల నోక బ్రాకి తావి లేదు
ద్రాక్ష పందిరి వేలాలతల చెతంగు
నీలరత్నంబులను బోలు నిక్కలూద
కమల సౌరభ్య మెన్న శక్యంబుగాదు॥

సీ॥ తాలకుద్దాల తక్కోల హింతాల తమాలం
దివ్య వృక్ష సమాజములు నదు
వేదాంత సూత్రముల్ వినుల కింపుగా
చదువుచుండెడి కీర సముదయములు
సదమల స్వరముల సామగానంబులు జేయుచు
నున్నట్టి కోకిలలును, అపరిమితమైన యుపనిషత్తులనప్పు

హా విరనమ్ములను జూప్పులుల చె ప్రహృష్టైనన్॥

క॥ అని శ్రీరంగచరిత్రము
వినిపించిన నారదుండు విని తద్గిరిజే
శునిగని దేవా మీం వలన
నను దనవిగ వింటి రంగనాధు చరిత్రల్॥

క॥ కృతకృత్యుడ ధన్యుడనై
యతిశయమున బొందితి సౌఖ్యమందితి నని యా
క్షితిధర తనయాంధ్రిపునకు
నతి భక్తి నమస్కరించి యరిగె నిజేచ్ఛన్॥

గీ॥ అట్లు నారదుం డరిగిన నప్పురాంత
కుండు ప్రమథ సర్వ దిక్పాలకులను బోవ
బంచి పేరోలగంబు చాలించి యంతి
పురమునకు బోయి గౌరితో వరలుచుండె॥

క॥ నారద ముని యిబ్భంగిని
శ్రీరంగేశ్వరు చరిత్ర శివు వలనను వి
స్తారముగ విన్నది యదె మొద
లారంగని సేవ చేసి యలరుచునుండెన్॥

క॥ నారద శివ సంవాదం
బైరాజిలు రంగపతి మహా చరితములన్
సారెకు బఠించు వారికి
కోరా కులు దుల్లి నట్టి కలుషములడగున్

క॥ పావన రంగచరిత్రము
భూవలయంబున బఠించుట బుధజనులకు మా
శ్రీవల్లభ నారాయణా

దోష్యంతి హా పర సుఖములు తిరముగ నెపగున్॥

క॥ శ్రీ రంగ చరిత వల్లభ
నారాయణ మూర్తిన్ ఎప్పుడు నా మదిలోనా
గౌరవము నిలచి పలికిన
తీరున నే నెద రచించితి నిగడు భక్తిన్

గీ॥ అబ్జభవ ముఖ్య సురలకును సందరాని
యట్టి వల్లభనారాయణాఖ్య శౌరి
ఆజ్ఞ శిరసా వహించి మహామదమున
నవుర జెప్పి రంగ మాహాత్మ్య మిప్పుడూ॥

సీ॥ పంచసంస్కారార్థ పంచకారత్రయ
ప్రదగురు చరణారవింద
భగవదాచార్య సద్భాగవతాచార్య నాసక్త
నిర్మల మనః సరసిజాత
పూర్వ పరాచార్య భూరి గుణానుభవానంద
మగ్న చిత్తాంబుజాత
మంత్ర మంత్రార్థ సంభరిత మానస సాదు
జన సంచయ ప్రియ శాంత హృదయ
శౌరి కైంకర్య పాత్ర భాస్య చరిత్ర
నిర్భర తాప వపు సంధాన నిరుపమాన
లలిత వేంకట నిశ్శంక రాజ్య సకల
భార నిర్వాహ రిపుశిఖి వారివాహ॥

క॥ కరుణామృత సాగరము
స్థిర వృష్టి కరణాకులు ప్రతిష్ఠా విలస
చ్చరిత శ్రీ వైష్ణవహ్యా

త్వరితోపా నిత్యా సత్యా భ్రాంశమనీషాం

సుగంధి వృత్తం ॥

దారితారి నగర్ నిత్య దానవరం నవైభవా

సారసాక్ష పాద భక్తి సక్త సజ్జనావనా

భూరిసుందరాంగ రాజ పూజ్య వంశపావనా

పారమార్థికానివాత్మ భవ్య కీర్తి సౌష్ఠవా ॥

గద్యం ॥

ఇది శ్రీ వల్లీభ నారాయణ స్వామి కరుణా కటాక్ష

వీక్షణ సంలబ్ధ సరస కవితా పాత్ర నాగేంద్ర గోత్ర

పవిత్ర గుంటుపల్లి లక్ష్మీనారాయణ సుపుత్ర శ్రీ

మత్కందాళ వేంకటాచార్య వరసత్కృపా పాత్ర

సాధుజన విధేయ జగన్నాథ నామధేయ ప్రణీతంబైన

శ్రీరంగ మహాత్మ్యంబను మహా ప్రబంధంబునందు

సర్వంబు చతుర్థాశ్వాసము ॥

శ్రీరామ ద్రాక్షారామ శరణు ॥ వ్రాలం శబ్దములు తప్పులు

బాలంగల వేను శబ్ద సంగతి తెలుగ నైనది వెట్టక

నవ్వక పోలంగా దిద్దరయ్య బుధజనులారా ॥

రంగేశ నీ చరిత్రలు

పొంగుచు నే వ్రాసినాడ భువిలో నిది శ్రీ

రంగము నరిగిన మనుజుని

కంగుగ సమడనుచు జప్పగా పద్మాక్షా ॥

కారినామ సంవత్సర కార్తీక .... నాటి రాత్రిని

శ్రీరంగ మహాత్మ్యము బివినాదరామ నన్న వ్రాసి మన్నవ

లక్ష్మన్నగారికి ఇచ్చెను ॥ శ్రీ ॥ శ్రీ ॥ శ్రీ ॥

Composed by. 1. [illegible]

2. M Ramakrishna Naidu